పూజారికి కడుపునొప్పి వచ్చింది. ఆ రాత్రంతా పూజారి విపరీతముగ బాధపడిపోయాడు. ఉదయాన్నే వచ్చిచూస్తే, బాబాగారికి ఏమీకాలేదు. పూజారికి ఆశ్చర్యమైంది. రోగగ్రస్తులకు బాబా మంత్రము చదివో, ఏదైనా మందు ఇచ్చో బాగు చేసేవాడు. కావున పూజారి కూడ బాబయ్య దగ్గరికి పోయి కడుపునొప్పి పోయేదానికి మందు ఇమ్మన్నాడు. అప్పుడు బాబా తనవద్ద ప్రక్కన పెట్టుకొన్న గారెలు ఇచ్చాడు. ఇవి తింటే కడుపునొప్పి పోతుందని చెప్పాడు. వాటిని చూస్తూనే పూజారికి విషము మతికి వచ్చింది. గారెలను చేతిలోనికి తీసుకొని, తినకుండ పెట్టుకోవడము చూచిన బాబా "వాటిని తిను, నీవు ఏమీ భయపడవద్దు వాటిలోని విషమే నీ కడుపునొప్పిని లేకుండ చేస్తుందని" చెప్పాడు. పూజారికి ఏమీ అర్థము కాలేదు. వీటిలో విషమున్నదని ఆయనకెలా తెలుసు? ఇప్పుడు ఇవి తింటే నేను చస్తాను, తినకపోయినా బాధకు తట్టుకోలేక చస్తాను. బాధను అనుభవించి చచ్చే దానికంటే వీటిని తిని తొందరగ చచ్చేది మేలనుకొని గారెలను తిన్నాడు. తిన్న వెంటనే బాబాగారు చెప్పినట్లు కడుపునొప్పి మాయమైపోయింది. అక్కడనుండి పూజారి తలవంచుకొని పోయాడు.

మరి కొంతకాలమునకు పూజారికి బాబామీద ద్వేషము పెరిగిపోయింది. ఈమారు నేరుగా కోటలోనికి పోయి, రాజుగారికి బాబా పకురుద్దీన్ విషయము చెప్పి, గుడినుండి రాజుగారి చేత తరిమేయించాలనుకొన్నాడు. అలా అనుకొన్న తర్వాత ఒక దినము కోటలోని రాజుగారి వద్దకు పోయి ఒక పకీరు గుడిని ఆక్రమించుకొని, అపవిత్రము చేయుచున్నాడని చెప్పాడు. రాజుగారు భటులతో బాబా పకురుద్దీన్‌ను పిలువనంపాడు. ఇద్దరి వాదనలు విన్నాడు. దేవాలయము భక్తులది కానీ పూజారిది కాదు అని బాబా అంటాడు, ఆలయము పూజారిదే కానీ భక్తులది కాదు అని పూజారి అంటాడు. చివరికి రాజు ఎటూ తేల్చి చెప్పలేనివాడై

ఇద్దరికి కలిపి ఒక పరీక్ష పెట్టాడు. ఆ పరీక్షలో ఎవరు నెగ్గితే వారికే గుడి స్వంతమవుతుందని చెప్పాడు. ఆ పరీక్షకు ఇద్దరూ ఒప్పుకొన్నారు. ఆ పరీక్ష ఏమనగా! ఒక్కొక్క సున్నపు మూటలో ఒక్కొక్కరిని సున్నముతో సహా ఉంచి, మూటకట్టి, పెనుకొండ చెరువులో వేస్తే, ఎవరు ముందు మూటను విప్పుకొని బయటపడితే వారికే గుడి ఇవ్వడము జరుగుతుంది. రాజుగారు చెప్పిన ప్రకారము సున్నముతో సహా ఇద్దరిని మూటలుగా కట్టి నడి చెరువులో వేశారు. ఇదంత రాజుగారి సమక్షములోనే జరిగినది. మధ్యాహ్నము ఒంటిగంట సమయములో నీటిలో వేయగా, ఐదు నిమిషము లలో బాబాగారు ఒడ్డుకు చేరుకొన్నాడు. పూజారి సున్నములో ఉడికిపోయి చనిపోయాడు. బాబాగారు ఒడ్డుకు చేరిన వెంటనే చెరువు కట్టమీదనే నమాజ్ చేసి, రాజుగారివద్ద అనుమతి తీసుకొని వెళ్ళిపోయాడు. ఆ విధముగా శివాలయము బాబా పకురుద్దీన్ స్వంతమైనది. అప్పటినుండి శివభక్తులు వచ్చి, పూజచేసుకొని బాబా దగ్గర తమ కష్టాలను చెప్పుకొని పోవుచుండిరి. బాబా దగ్గర కష్టాలను చెప్పుకొంటే తీరిపోతాయని నమ్మేవారు. చాలామందికి అలా జరగడము వలన, అక్కడికి వచ్చేవారి సంఖ్య పెరిగి పోయింది. ఆ విధముగ బాబాకు, ప్రజలకు సంబంధము పెరిగిపోయింది. కొంతకాలము గడువగా బాబాకు వృద్ధాప్యము వచ్చి చివరకు చనిపోవడము జరిగింది. చనిపోయిన తర్వాత సూక్ష్మశరీరముతో అక్కడే ఉండడము జరిగినది.

బాబాగారు చనిపోయిన తర్వాత అంతవరకు ఆయనతో పరిచయ మేర్పడిన ముస్లీమ్ భక్తులు, బాబా చనిపోకముందే తమతో చెప్పిన ప్రకారము ఆయన శరీరము గుడిలోపలే పూడ్చిపెట్టి దర్గాకట్టినారు. (నేటికీ దర్గా ఉంది, శివాలయము ఉంది. ప్రస్తుత కాలములో పాతవారికి, ఆ ఊరి

వారికి అది "శివాలయము" అని తెలుసుగానీ క్రొత్తవారికి బాబా పకురుద్దీన్ "దర్గా" అనియే తెలుసు.) అక్కడ ప్రతి సంవత్సరము బాబాగారి ఉరుసు జరుగుతుంది. ఆ ఉరుసు ప్రత్యేకత ఏమిటంటే బాబాగారు మొదట పుల్ల నాటగా చిగురించిన మిస్వాక్ చెట్టు (చక్కెరమాను) నుండి ఉరుసు దినమున చక్కెర రాలుతుందట. ఆ చక్కెరను బాబాగారికి చదివింపులు చేస్తారట. పూర్వము ఆ చెట్టునుండి ఆ దినము ఒక కేజీ చక్కెర రాలేదట. ప్రస్తుత కాలములో ఒక పిడికెడు మాత్రమే రాలుతుందని చెప్పుచున్నారు. (ఇది చెప్పితే వినడమే కానీ నేను చూడలేదు.)

**నేను :-** ఇదంతా బాబా పకురుద్దీన్ (సత్యంరాజు) చరిత్ర. కానీ సాయబ్ బాబా ఏమైనట్లు? ఒక్కమారైన ఆయన మీవద్దకు వచ్చాడా? లేక మీరు ఆయనవద్దకైనా పోయారా? ఆయన ఎక్కడున్నట్లు?

**ఆమె :-** పెనుకొండ కోటదగ్గర గుహలో మాట్లాడిన తర్వాత సాయబ్‌బాబా గారు వందలసంవత్సరముల కాలము, మహారాష్ట్రలోని షిరిడి దగ్గర భూమిలో ఏర్పరచుకొన్న గుహలో ధ్యానములో ఉండిపోయాడు. తర్వాత బయటకు వచ్చి షిరిడిలోనే తిరుగుచుండెడి వాడు. అప్పుడు కూడా ఆయన పేరు సాయబ్‌బాబానే! కానీ కాలక్రమేపి ఆయన పేరులో కొంత మార్పు వచ్చినది. చిన్నపిల్లలు నోరు తిరుగక సాయబ్ అనకుండ సాయబాబా అనెడివారు. అలా ఒక అక్షరము ఆయన పేరులో మాయమైపోయినది. సాయబాబాగా ఆయన జీవితకాలము అంతా గడిచిపోయింది. అక్కడ ఆయన చనిపోయినా సూక్ష్మముగానే మిగిలిపోయాడు. సూక్ష్మశరీరముతో తిరిగి పెనుకొండ ప్రాంతమునకే వచ్చి, ఇక్కడ మమ్ములను చూచి దీవించి ఇక్కడికి దగ్గరగానే ఉంటానని చెప్పి, సత్యనారాయణ రాజు అను బాలునిలో చేరి ఆ శరీరములోనే నేటికినీ పుట్టపర్తిలో ఉన్నాడు. ఇప్పుడు వంద సంవత్సరముల

నుండి సాయిబాబాగా పిలువబడుచున్నాడు. మొదట పెనుకొండలో సాయబ్‌బాబాగా తర్వాత షిరిడిలో సాయబాబాగా, ప్రస్తుత కాలములో పుట్టపర్తిలో సాయిబాబాగా పిలువబడుచున్నాడు.

**నేను :–** సాయిబాబాగా ఎంతకాలము బ్రతుకుతాడో చెప్పగలవా?

**ఆమె :–** ఇప్పుడు నేను చెప్పేది ఏముంది? మూడు సంవత్సరముల క్రితము మీరే చెప్పారు. ఆయన ఆయుస్సు 90 నుండి 96 వరకు గలదని, బహుశ 92వ సంవత్సరము చనిపోవచ్చని ఒక సందర్భములో చెప్పారు. 'చంద్రునిలో నీళ్ళున్నాయి' అని కూడా అప్పుడే చెప్పారు.

**నేను :–** నేను ఎప్పుడో చెప్పినది నీకెలా తెలుసు?

**ఆమె :–** మీరు ఇదే పెనుకొండ ప్రాంతములో మీ శిష్యులతో సహా జీపులో వచ్చి రాత్రిపూట రైల్వేగేట్ దగ్గరున్న ఆంజనేయస్వామి గుడివద్ద ఆగారు. అక్కడ మీ శిష్యులకు చెప్పుచుండగా నేను విన్నాను. నేనే కాదు మా అన్న బాబా పకురుద్దీన్ కూడా విన్నాడు.

**నేను :–** ఆ సమయములో మీరు అక్కడెందుకున్నారు. ఒక విధముగా ఈ ప్రశ్న నేను అడుగకూడదు. కావున దానికి జవాబు వద్దు కానీ ఇక్కడికి ఎందుకొచ్చావు? ఈ గర్భిణి మనిషిలోకే ఎందుకొచ్చావు?

**ఆమె :–** నేను ముందే చెప్పాను కదా! ఈమె మా భక్తురాలని, అన్న ఆజ్ఞ ప్రకారము నేను అప్పుడప్పుడు వచ్చి ఏ దయ్యాలు ఈమె జోలికి రాకుండ చూసి పోతుంటాను. ప్రస్తుతము రెండు రోజులనుండి నేను పెనుకొండలోనే ఉంటిని, ఇక్కడికి రాలేదు. అదునుచూచి ఒక దయ్యము ఈమెలో దూరడము, మీరు పోయి బయటికి పంపిరావడము జరిగినది.

బాబాగారు మక్కాకు పోయాడు కాబట్టి రెండు దినములనుండి ఇక్కడికి రాలేకపోయాను. ఇప్పుడు ఇక్కడికి వచ్చిన తర్వాత మీరు వచ్చి ఈమెను చూచివచ్చినట్లు నాకు తెలిసింది. ముందు ఒక మారు మిమ్ములను చూచాను కాబట్టి ఇప్పుడు చూడాలని, మీతో మాట్లాడాలని వచ్చాను. నా కోరిక నెరవేరింది.

**నేను :-** మీ అన్న సత్యంరాజు బాబాపకురుద్దీన్ అని పేరు మార్చుకొన్నపుడు, నీవు నీ పేరు మార్చుకోకుండ అంబోజమ్మ అని పాతపేరుతోనే ఉన్నావెందుకు?

**ఆమె :-** అన్న స్వయముగా పేరు మార్చుకోలేదు. అన్నకు సాయబ్‌బాబాగారు పేరు మార్చారు. నాకు ఎవరూ మార్చలేదు, అందువలన ఆ పేరుతోనే ఉన్నాను.

**నేను :-** పెనుకొండ దర్గాదగ్గర మీరు ఇద్దరే ఉన్నారా?

**ఆమె :-** దాదాపు రెండు వందలమంది ఉన్నారు. కానీ మా అంత వయస్సున్న వారు ఎవరూ లేరు.

**నేను :-** రెండువందల మంది కనిపించే వారా? కనిపించని వారా?

**ఆమె :-** కనిపించేవారు వచ్చి వారి కోర్కెలు చెప్పుకొని పోతూవుంటారు. కనిపించని వారే రెండు వందలమంది అక్కడే ఉంటారు. అన్నతో జ్ఞానమును చెప్పించుకొంటుంటారు.

**నేను :-** ఇప్పుడు మీ అన్న దర్గాదగ్గర లేడు కదా! ఇప్పుడు ఎవరు అక్కడ పెద్దగా ఉంటారు.

**ఆమె :-** ఎవరూ ఉండరు. నేనే వెళ్ళాలి. స్వామిగారు నాకు సెలవు ఇవ్వండి నేను పోయివస్తాను.

(చివరిలో ఆమె నమస్కారము చేసి, గర్భిణీ మనిషి శరీరము నుండి వెళ్ళి పోయింది.)

ఇదంతా ఒక సినిమా కథలాగ ఉంది కదా! అట్లని కథ అనుకునేరు. అంతయు వాస్తవమే! అంబోజమ్మ మాట్లాడడము ద్వారా ఎన్నో క్రొత్త విషయములు, ఎవరికీ తెలియని రహస్యములు తెలిసినవి. ఈ సంభాషణ జరిగి ఇప్పటికి ముప్ఫై సంవత్సరములైనది. మేము మాట్లాడినప్పటి నుండి ముప్ఫై సంవత్సరములు గడిచినా, శిష్యుడైన బాబా పకురుద్దీన్, గురువు అయిన సాయబ్‌బాబాగారు నేటికినీ ఒకరు కనిపిస్తూ, ఒకరు కనిపించక యున్నారు. సాయబ్‌బాబా కారణము వలననే పెనుకొండ ప్రాంతము చరిత్ర సంతరించుకొన్నది. విదేశాలకు సహితము బాబాగారి వలన పెనుకొండ పేరు తెలిసినది. సూక్ష్మశరీరములను గురించి చెప్పుచున్నాము కావున వీరు కూడ సూక్ష్మశరీముతోనే ఉన్నారని తెల్పుటకు ఈ సంఘటన చెప్పవలసి వచ్చినది. బాబాల భక్తులు ఎందరో దయ్యాలు లేవు అంటున్నారు. వారికి కూడా సూక్ష్మశరీరములంటే ఏమిటో, ఎలా ఉండగలుగుచున్నాయో దీనిమూలముగా సులభముగా తెలియగలదు. అంతేకాక ఒక మనిషి 70,80,90,100 సంవత్సరములే కాక సూక్ష్మశరీరముతో వందల సంవత్సరములు బ్రతుకుచున్నాడని ఇందుమూలముగా తెలియుచున్నది. మరియు కనిపించని జీవితమును కూడా మంచి మార్గములో నడుపుకొను వారు భూమి మీద ఎందరో ఉన్నారని కూడా ఇందు మూలముగా తెలియుచున్నది. ఇంకొక ముఖ్యమైన విషయము. కొందరు క్రొత్త జన్మకు పోకుండానే శరీరములను మార్చి బ్రతుకగలుగుచున్నారని కూడా దీని మూలముగా తెలియుచున్నది.

సత్యసాయి బాబాగా పుట్టపర్తిలో యున్న సాయబ్‌బాబాగారు ఎంతకాలము జీవిస్తారని కొందరు అడిగినప్పుడు ఆయన ఆయుష్షు

దశాచారము ప్రకారము దశముగింపుకు 96 సంవత్సరమున్నది. అయితే దశలో 92 సంవత్సరములకు చనిపోవునని మేము చెప్పియున్నాము. ఈ విషయము 2008వ సంవత్సరము చెప్పియున్నాము. అప్పుడు పుట్టపర్తి సాయిబాబాగారు బ్రతికేయున్నారు. నేడు ఈ గ్రంథమును 2016వ సంవత్సరములో వ్రాయుచున్నాను. అయితే ఇప్పుడు పుట్టపర్తి సాయిబాబా గారు మరణించియున్నారు. ఆయన పుట్టిన తర్వాత ఆయన 87వ పుట్టిన రోజు గడచిన తర్వాత చనిపోవడము జరిగినది. మేము సాయిబాబాగారు 92 సంవత్సరములకు చనిపోతాడనగా ఆయన ఐదు సంవత్సరములు ముందుగానే చనిపోవడము జరిగినది. అలా చనిపోవడము వలన నేను చెప్పిన మాట అసత్యముగా కొందరికి కనిపించడమైనది. అప్పుడు చాలామంది నా దగ్గరకు వచ్చి సాయిబాబాగారు ఆసుపత్రిలో యున్నప్పుడు ఆయన ఆయుష్షును గురించి మిమ్ములను అడుగగా, మీరు 92 సంవత్సరములకు చనిపోవునని చెప్పారు కదా! ఇప్పుడేమో ఆయన 87వ సంవత్సరమే చనిపోయాడు అదెలా జరిగియుండునని వివరమడిగారు. అంతవరకు నేను చెప్పిన మాట అసత్యమయినదని అనుకొనే వాడిని, అయితే ఇతరులు వచ్చి నన్ను నీమాట అసత్యమని చెప్పినప్పుడు, వారి మాటను ఖండించుచూ ఇలా చెప్పడము జరిగినది. **నామాట ఎప్పటికీ అసత్యము కాదు.** సత్యసాయిబాబాగారు ఖచ్చితముగా 92 సంవత్సరములకే చనిపోయాడు అని నా నోటి వెంట మాట రావడము నాకు కొంత ఆశ్చర్యము అయినది. తర్వాత "మాట్లాడు ప్రతిమాట నాది కాదు నా తండ్రియైన ఆత్మదే"యని జ్ఞాపకము రావడము జరిగినది.

ఒక దైవగ్రంథములో **"మీ తండ్రి ఆత్మ మీలోయుండి మాట్లాడుచున్నాడేగానీ, మాట్లాడువారు మీరు కాదు"** అని

తెలియడమే కాక ప్రథమ దైవగ్రంథమైన భగవద్గీతయందుగల పురుషోత్తమ ప్రాప్తి యోగములో 15వ శ్లోకమున **"నేను మీ హృదయ పీఠము మీద ఉన్నాను. నా వలననే మీకు స్మృతి, ఊహ, జ్ఞానము కల్గుచున్నది"** అను మాట కూడా జ్ఞాపకము వచ్చినది. దానితో అప్పుడు పలుకబడు మాటలను వినడము జరిగినది. అప్పుడు చెప్పబడిన మాటలు ఈ విధముగా ఉన్నాయి. సత్యనారాయణ శరీరములో సాయిబాబా నివసించడము అందరికీ తెలిసినట్లు 87 సంవత్సరములయినది. అయితే అందరికీ తెలియకుండా సత్యనారాయణ శరీరములో సాయిబాబా గారు ఐదు సంవత్సరముల ముందునుండి నివసించడము జరుగుచున్నది. ఆ తెలియని ఐదు సంవత్సరములను కలుపుకొంటే 92 సంవత్సరములు ఆయుష్షు పూర్తి అయినట్లే కదా! సాయిబాబాగారు శిరిడిలో చనిపోయిన తర్వాత మూడు సంవత్సరములకు ఆయన పదిహేను భాగముల సూక్ష్మశరీరముతో సత్యనారాయణ రాజు శరీరములో ప్రవేశించడము జరిగినది. అలా ప్రవేశించిన సాయిబాబాగారు అతని శరీరములో బ్రహ్మనాడిలో చేరకుండా మిగతా శరీరములో ఉంటూ ఒక దినమునకు ఒక గంట లేక రెండు గంటలు సత్యనారాయణ రాజు శరీరములోని బ్రహ్మనాడిని చేరి ఉండి తర్వాత అదే శరీరములో ప్రక్కన ఉండెడివాడు. అయితే రెండు లేక మూడు గంటలు బ్రహ్మనాడిలో నుండి తాను సాయిబాబానని చెప్పి ప్రజలతో మాట్లాడేవాడు. ఆ విషయము అందరికీ తెలిసిపోయిన తర్వాత పూర్తి స్థాయిలో సత్యనారాయణ రాజు శరీరమును ఆక్రమించుకోవడము, పూర్తి పైకి మాట్లాడడము జరిగినది. దీనినిబట్టి సత్యసాయి 92 సంవత్సరములు బ్రతికినట్లేగా లెక్కించబడినది. ఈ విషయమంతయూ తెలిసిన తర్వాత నేను చెప్పిన మాట పొల్లు పోకుండా నెరవేరినదని తృప్తి చెందడము జరిగినది.

**ప్రశ్న :- సాయిబాబాగారు పూర్తిగా చనిపోక పోవడము వలన, ఆయన సూక్ష్మ శరీరముతో ఉండడము వలన, మరొక శరీరమును ఆవహించి అందులో బ్రతకడము జరిగినదని మీరు చెప్పారు. జరిగిన సంఘటనలను బట్టి అది నిజమేనని కొంతవరకు తెలియుచున్నా, ఇంకా కొంత అనుమానము లోపల మిగిలియున్నది. ఇది సాయిబాబా ఒక్కనికి మాత్రమే జరిగినట్లు నేను అనుకొంటున్నాను, దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** సాయిబాబా విషయమును మేము విపులముగా చెప్పాము కావున అదిమాత్రము నీకు కొంత అర్థమయి, ఇది సాయిబాబా ఒక్కని విషయములో మాత్రము జరిగినదని అనుకోవచ్చును. సత్యము తెలిస్తే ఆశ్చర్యపోక తప్పదు. నిజము చెప్పితే నూటికి ఇరవైమందిలో పైకి కనిపించే వ్యక్తులు కాకుండా సూక్ష్మశరీరములతో వారి శరీరములలో ప్రవేశించి పైకి కనిపించే మనుషులుగా నటించుచున్నారు. భర్త శరీరములో భార్యకు తెలియకుండా వేరే పురుషుడు సూక్ష్మశరీరముతో చేరి భర్తను లేకుండా చేసి, చేరినవారే భర్తగా నటించు వారిని ఎందరినో చూచాము. అలాగే భార్య శరీరములో భర్తకు తెలియకుండా వేరే ఆడవారు చేరి భార్యవలె నటించుచూ అతనితో కాపురము చేయువారు కూడా కలరు. వారు మేము వేరేవారమని చెప్పలేదు. సాయిబాబా నేను సత్యనారాయణ రాజును కాదని చెప్పాడు. కాల మరణ, అకాల మరణ, తాత్కాల మరణముల గురించి తెలిసిన నేను చనిపోయి సూక్ష్మశరీరములుగా మిగిలిన వారిని, సూక్ష్మశరీరములతో ఇతరులయందు చేరిన వారిని ఎందరినో చూచాను. ఈ విషయములో 40 సంవత్సరముల క్రితమే నా పరిశోధన సాగినది. అప్పటినుండి నేను ఎన్నో సంఘటనలను చూచాను. ఎంతో అనుభవముతో సూక్ష్మములను గురించి తెలుపుచున్నాను. మనుషుల సూక్ష్మములనే

కాకుండా, ఆకాశములోయున్న భూతములను, ఉపభూతములను, గ్రహాలను, ఉపగ్రహాలను, భూమిమీద బ్రతికియున్న దేవతలను గురించి బాగా తెలిసిన అనుభవమున్నది.

**ప్రశ్న :- మీరు చెప్పగా సాయిబాబా విషయము, బాబా పకురుద్దీన్ విషయము రెండు తెలిసినవి. ఇప్పుడు పుట్టపర్తిలో సత్యసాయిగా చలామణి అయిన శిరిడి సాయిబాబాగారు చనిపోవడమైనది. ఇప్పుడయినా ఆయన పూర్తి మరణమును పొంది రెండవ జన్మకు పోయాడా? లేక సూక్ష్మశరీరముతోనే యున్నాడా?**

**జవాబు :-** ఈ విషయమును నేను చెప్పవలసిన అవసరము లేకుండా చనిపోక ముందే సాయిబాబాగారు ఆ విషయమును ప్రకటించారు. నేను కర్ణాటక రాష్ట్రములో ఫలానా గ్రామములో ప్రేమసాయిగా వస్తానని చెప్పాడు. అంతటితో ఆగియుంటే సరిపోయేది. అట్లుకాకుండా ఆయన ప్రేమసాయిగా యున్న యుక్తవయస్సులోని ఫోటోను ఇవ్వడము జరిగినది. దీనినిబట్టి యుక్తవయస్సులోయున్న అతని శరీరములో ఇప్పటివలె చేరిపోతాడా లేక క్రొత్తగా పుట్టి వస్తాడా అని సందిగ్ధములో పడిపోయాము. అందువలన తర్వాత జన్మ విషయమును గురించి మేము కూడా ఏమీ చెప్పలేదు.

**ప్రశ్న :- సాయిబాబా గారు జన్మించకుండా మోక్షమునకు పోలేదంటారా?**

**జవాబు :-** ఆయనే నేను ఫలానా మనిషిగా వస్తానని ముందే చెప్పినప్పుడు మోక్షము అనేమాటే ఇక్కడ రాదు. నేను మోక్షమునకు పోను అని ఆయనే చెప్పినట్లు కాదా!

**ప్రశ్న :- మోక్షమునకు పోలేదు కావున ఆయనను దేవుడని చెప్పకూడదు కదా! మోక్షము పొందినవాడు దేవునిలోనికి ఐక్యమయివుండును. కావున వానిని దేవుడనవచ్చును కదా! దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** మనిషి మోక్షము పొందితే దేవునిలోనికి ఐక్యమగుట వాస్తవమే. అయితే ముందే దేవుడైయున్న వానికి మోక్షముతో సంబంధము లేదు. దేవుడు మనిషిగా అవతరించినప్పుడు ఆయన మోక్షము పొందకపోయినా దేవుడే యగును. ఆయనే మోక్షమైయున్నప్పుడు ఆయన తిరిగి మోక్షము పొంద నవసరములేదు. మనిషి మోక్షము పొంది దేవునిలోనికి కలిసి పోవచ్చును. దేవుడు మనిషిగా వచ్చితే ఆయన మోక్షము పొందవలెనను నియమము లేదు.

**ప్రశ్న :- ఆది శంకరాచార్యులు స్థాపించిన నాలుగు పీఠములలో ప్రస్తుత ద్వారకా పీఠాధిపతియైన స్వరూపానంద శిరిడి సాయిని గురించి 24 ఆరోపణలు చేసి ఆయన దేవుడు కాదనీ, ముస్లీమ్ మతమునకు సంబంధించిన పకీర్‌యనీ, ఆయన విగ్రహమును హిందూ దేవాలయము లలో నుండి తీసివేయాలని చెప్పడము జరిగినది. అంతేకాక ఆయన హిందూ గురువు కాదని, అటువంటప్పుడు ఆయనను గురువుగా భావించి గురుపౌర్ణమి రోజు విశేష పూజలు చేయడము తప్పని, హిందువులను భక్తి పేరుతో చీల్చే దానికే ముస్లీమ్‌లు సాయిబాబాను దేవునిగా సృష్ఠించి హిందువులలో వదిలారని తీవ్రముగా ఆరోపించడము జరిగినది. ఆయన ఆరోపణలలో సారాంశమున్నదా? ఆయన ఆరోపణలు సక్రమమైనవేనా?**

**జవాబు :-** ద్వారకా పీఠాధిపతి అయిన స్వరూపానందగారు 2014వ సంవత్సరమే ఈ ఆరోపణలు చేశాడు. అప్పటినుండి ఆ సమస్యను మిగతా స్వామీజీలు భుజాన వేసుకొని దానినే సాగదీయుచున్నారు. ఆరోపణలు చేయువారు సహజముగా ఎక్కడయినా కలరు. అయితే ఆ ఆరోపణలను వినినవారు ఇది నిజమా అబద్ధమాయని యోచించి నడుచుకోవలసి

యుంటుంది. అట్లుకాకుండా ఎవరు ఎట్లు తోలితే అట్లు పోయినట్లు మనము కూడా ఆలోచించకుండా గ్రుడ్డిగా మాట్లాడకూడదు. ఒక అద్వైత పీఠమునకు సంబంధించిన స్వామీజీ ఆరోపించితే, అద్వైతమును అనుసరించు మిగతా స్వాములు, భక్తులు అందరూ అదే మాట్లాడడములో అర్థము లేదు. ఒకవేళ మాట్లాడినా ప్రతి దానికి ఆధారము చూపి మాట్లాడ వలసియుంటుంది. ఆధారము లేకున్నా ఎవడో అన్నాడని మనము కూడా అంటే అది గొర్రె దాటులాగ అవుతుంది గానీ విచక్షణ అనిపించుకోదు.

లోకానికి (ప్రపంచానికి) భగవద్గీతా జ్ఞానమును అందించిన కృష్ణుడు సాక్షాత్తు భగవంతునిగా భూమిమీదకు వస్తే, దేవుని ఆత్మయైన భగవంతున్ని కూడా జారుడు, చోరుడు అన్నవారు గలరు. ఎంతటి వాడినయినా విమర్శించకుండా ఎవరూ వదలలేదు. సామాన్య మానవులయిన మనలను కూడా వదలకుండా విమర్శించినవారు గలరు. ఎవరికయినా ఎంతటి వారికయినా విమర్శలు, ఆరోపణలు సహజమే. వాటిని వినేవారే విచక్షణతో యోచించవలసియుంటుంది. అప్పుడయితేనే అసత్యమును వదలి సత్యమును ఆశ్రయించినట్లగును.

(ఈ మధ్యకాలములో దాదాపు పదిహేను రోజుల క్రితము TV9 లో **'స్వాముల లడాయి'** అని ఒక చర్చావేదిక నిర్వహించడమైనది. అందులో కర్నాటక హంపిలోగల పంపాక్షేత్రం పీఠాధిపతియైన **'గోవిందానంద'** సాయిబాబాను దేవుడు కాదని విమర్శించుటకు రాగా, సాయిబాబా దేవుడే యని చెప్పుటకు విశాఖ పట్టణమునందు గల సీతమ్మధారకు చెందిన **'రమణానంద మహర్షి'** రావడము జరిగినది. టీవీ యాంకర్‌గా **సత్య** ఉండగా జరిగిన చర్చావేదికలో మధ్యలో ఫోన్ ద్వారా కొందరు ప్రేక్షకులు కూడా మాట్లాడి ప్రశ్నలు వేయడము జరిగినది. వారి సంభాషణలు క్రింది

విధముగా ఉన్నవి. వారు అడిగిన ప్రశ్నలకు ఇక్కడ నా సమాధానములను జోడించి చెప్పుచున్నాను. చర్చావేదికలోని వారి మాటల వలన చాలామందికి ఏమీ అర్థము కాలేదు. ఏది న్యాయమో, ఏది అన్యాయమో తెలియలేదు. అట్లే ఎవరి మాట జ్ఞానమో, ఎవరిమాట అజ్ఞానమో కూడా అర్థము కాలేదు. అందువలన వారి ప్రశ్నలకు మేము జవాబులు చెప్పడము వలన ప్రపంచ సంబంధ న్యాయాన్యాయములు, దైవసంబంధ జ్ఞానాజ్ఞానములు తెలియునని అనుకొంటున్నాను.)

**ప్రశ్న :- (TV9) శిరిడి సాయిబాబాను పూజించడము వలననే మహారాష్ట్రలో కరువు వచ్చిందని కొందరు ఆరోపించుచున్నారు. ఇది ఎంతమటుకు వాస్తవము?**

**నా జవాబు :-** శిరిడి సాయిబాబాను శిరిడిలో దాదాపు 160 సంవత్సరములనుండి గుడికట్టి పూజించుచున్నారు. సాయిబాబాను పూజించడము వలన కరువు వచ్చిందంటే, 160 సంవత్సరములనుండి కరువు ఉంటే ఆ మాట సరిపోతుంది. ఏదో ఒక సంవత్సరము వాతావరణ మార్పుతో అనావృష్ఠి వలన కరువు వస్తే దానికి సాయి పూజకు ఎటువంటి సంబంధము లేదు. సరిపోనప్పుడు ఏదో ఒకటి మాట్లాడవలెనని మాట్లాడు అసూయ మాటలు తప్ప అందులో సత్యము లేదు. కరువు ప్రకృతికి సంబంధించిన సమస్యగానీ, పూజలకు సంబంధించినది కాదు.

**ప్రశ్న :- (గోవిందానంద) సిద్ధాంతములు మూడే గలవు. అందులో ఏ సిద్ధాంతమునకు సంబంధించినవాడు శిరిడి సాయిబాబా?**

**నా జవాబు :-** గోవిందానంద అను ఒక సన్యాసి అనవసర రాద్ధాంతమును తీసుకవచ్చి TV9 కెమెరాముందు కూర్చొన్నాడు. ఈ వాదములో అతను

బయటికి తెలియబడవలెనను కుతూహలము తప్ప మిగతా సారాంశము ఏమి కనిపించలేదు. ప్రతి జవాబుకు అడ్డము మాట్లాడి ఎదుటి వారిని తప్పు పట్టడము తప్ప, అతని వద్ద సారాంశమైన ఏ విద్యలేదు. సంపూర్ణ జ్ఞానము తెలిసినవాడుగానీ, కొంతవరకు జ్ఞానము తెలిసినవాడుగానీ అలా అడ్డముగా మాట్లాడడు. రమణానంద చెప్పు జవాబు ఏమిటి అన్నది కూడా వినిపించకుండా గట్టిగా అరవడము తప్ప తాను చెప్పునది ఏదీ లేదు. ఒక ప్రశ్న వేసినప్పుడు ఎదుటివాడు చెప్పే జవాబును వినాలి కదా! చెప్పిన జవాబు సరిగాలేకపోతే అప్పుడు దానిని గురించి మాట్లాడడము మంచిది. అలాకాకుండా చెప్పే సమాధానమును వినకుండా మాట్లాడడము వలన అతను జవాబు కొరకు రాలేదని, అనవసర రాద్ధాంతము చేయను వచ్చాడని మాత్రము ఆ దృశ్యమును చూచువారందరికీ అర్థమైపోవుచున్నది. ఇప్పుడు ఆయన అడిగిన ప్రశ్న ఏ సిద్ధాంతము ప్రకారము సాయిబాబా ఉన్నాడని అని అడిగాడు? అంతేకాక సిద్ధాంతములు మూడు గలవు అని కూడా చెప్పాడు.

ఆది శంకరాచార్యుల అద్వైతము మొదటిదికాగా, తర్వాత వచ్చినది రామానుజాచార్యుల వారియొక్క విశిష్టాద్వైత సిద్ధాంతము. ఆ తర్వాత వచ్చినది మధ్వాచార్యుల యొక్క ద్వైత సిద్ధాంతము. **ఇప్పటికి 38 సంవత్సరముల క్రిందట త్రైత సిద్ధాంతము ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరుల ద్వారా ప్రకటించబడినది.** అప్పటినుండి ఇప్పటివరకు ప్రచారము చేయబడుచూనేయున్నది. త్రైత సిద్ధాంతమును అనుసరించి ఇప్పటికి 80 గ్రంథములు వ్రాయబడినాయి. ముఖ్యముగా "త్రైత సిద్ధాంత భగవద్గీత" వ్రాయబడి ప్రచారము చేయబడినది. ఇంటర్‌నెట్‌లో త్రైత సిద్ధాంత గ్రంథములన్నియూ ఉన్నవి. అంతేకాక ఆంధ్ర, తెలంగాణా

రాష్ట్రములో **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** యను పేరు వినని వారులేరు. ఇప్పటికి ఐదు సంవత్సరములనుండి ప్రతి ఊరు గోడమీద **"త్రైత సిద్ధాంత భగవద్గీతను చదవండి"** అని వ్రాసియుంచాము. నేడు త్రైత సిద్ధాంత ప్రచారము, త్రైత సిద్ధాంత భగవద్గీత కర్ణాటక రాష్ట్రములోనికి కూడా ప్రవేశించినది. నేడు చాలామంది జ్ఞానులకు అజ్ఞానులకు త్రైత సిద్ధాంత మనునది దగ్గరగా తెలిసియున్నది. అటువంటప్పుడు సిద్ధాంతములు మూడే ఉన్నవని చెప్పడము వింతగా యున్నది. నేడు అందరికీ నాల్గవ సిద్ధాంతమును గురించి తెలిసియుండగా, ఆయన మూడేగలవని చెప్పడము వలన ఆయనకు ఏమీ తెలియదనిపించుచున్నది. 40 సంవత్సరముల వెనుకే ఉన్నాడనిపించుచున్నది.

నేడు త్రైత సిద్ధాంతమును చూచిన చాలామంది స్వామీజీలు అది హిందూమతములో ఒక సిద్ధాంతమని తెలిసినా, తామున్న అద్వైతమే గొప్పదను భావముతో త్రైత సిద్ధాంతము యొక్క సారాంశమేమియని చూడకనే త్రైత సిద్ధాంతము క్రైస్థవులది. క్రైస్థవులు తమ బైబిలు బోధలను త్రైత సిద్ధాంత భగవద్గీతయని పేరుపెట్టి, భగవద్గీత ముసుగులో తమ మతమును ప్రచారము చేయుచున్నారని తప్పుడు ఆరోపణలు చేయుచున్నారు. క్రైస్థవులు హిందువుల ఆరోపణలను చూచి నవ్విపోతున్నారు. హిందువులు చివరకు వారి గ్రంథములను వారే నమ్మలేని స్థితికి వచ్చారనీ, క్రైస్థవుల బైబిల్‌ను చూచి భయపడుచున్నారని చెప్పుకొంటున్నారు. కొందరు స్వాములకు త్రైత సిద్ధాంత భగవద్గీత హిందువులలోని ఒక సిద్ధాంతమునకు సంబంధించిన దని తెలుసు. అయినా అది ఇతర మతస్థులదని చెప్పడము మానుకోలేదు. భారతదేశములో అద్వైత సిద్ధాంతము బలముగాయుండుట వలన మొదట విశిష్టాద్వైతమును కూడా అలాగే విమర్శించి విశిష్టాద్వైతులను కొట్టడము,

చంపడము చేశారు. చరిత్రలో తామే ఉండవలెనన్నట్లు అద్వైతులు ప్రవర్తించు చున్నారు.

**ప్రశ్న :- (గోవిందానంద) ఆది శంకరాచార్యులు స్థాపించిన నాలుగు పీఠములలో ఆ పీఠాధిపతులుగా ఎవరున్నా వారు ఆదిశంకరులతో సమానమేయని స్వయముగా శంకరాచార్యులే చెప్పారు. అటువంటప్పుడు నాలుగు పీఠములలో ఒకటయిన ద్వారాకా పీఠాధిపతి అయిన స్వరూపానంద చేసిన ఆరోపణలను సరికాదంటారా?**

**నా జవాబు :-** ఆది శంకరాచార్యుల వారు నాల్గు పీఠాధిపతులు తనతో సమానమని ఆది శంకరులే చెప్పినట్లు చెప్పి, శంకరాచార్యులకు ప్రజలలో ఉన్న గౌరవమును తమకు ఉండవలెనని అనుకోవడము తప్ప అందులో సత్యము లేదు. శంకరాచార్యులు ఆ మాట చెప్పాడని నేడు వీరు చెప్పుచున్నారు తప్ప ఆ మాట చెప్పాడనుటకు ఆధారమేలేదు. ఆ మాటను చెప్పు అవసరమేలేనప్పుడు శంకరాచార్యుల వారు ఎలా చెప్పగలడు. గుజరాత్‌లో ద్వారకయందు జామ్‌నగరమున శంకరునికి 18 సంవత్సరముల వయస్సు లోనే మఖ నక్షత్రము శుక్ల సప్తమి తిథి రోజున తొలి పీఠమును స్థాపించడము జరిగినది. 17 దాటి 18వ సంవత్సరము గడుచుచుండగా శంకరునిచేత ఆనాటి ఆర్యులు ద్వారకలోని కాళీపీఠమును స్థాపింపజేశారు. శంకరుడు కాలినడకన తన 15వ సంవత్సరము దాటి 16లో పడుతూనే దేశపర్యటన మొదలు పెట్టాడు. ఆనాటి పరిస్థితిని చూస్తే ఆ వయస్సులో అద్వైతమంటే ఏమిటో కూడా ఆయనకు తెలియదు. అయినా ఆయనను బొమ్మగా చూపి అద్వైతమును బోధించినవారు, అలాగే ద్వారకా పీఠమును స్థాపించిన వారు ఆర్యులేనని చెప్పక తప్పదు. ఆనాడు ఆర్యుల చేతిలో కీలుబొమ్మవలె చిక్కుకొని తన పరిస్థితి ఎవరికీ చెప్పుకోలేక బాధపడిన

శంకరుడు ఆ పీఠాధిపతులు తనతో సమానమని చెప్పియుందురేమో మీరే ఆలోచించండి. ఆనాటి యదార్థస్థితి తెలియాలంటే మా రచనలలో **"హిందూమతములో సిద్ధాంతకర్తలు"** అను గ్రంథమును చదవండి. అద్వైతము పేరుతో ఆర్యులు ఎంత మోసమునకు పాల్పడినది తెలిసిపోతుంది.

ప్రత్యక్షముగా ఉన్న ఒక కుటుంబములో ఒక తండ్రికి నలుగురు కొడుకులుంటే అందరూ ఒకే విధముగా ఉండక వారివారి బుద్ధిలోనూ, వారివారి భావములోనూ ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా ఉండుట అందరికీ తెలిసిన విషయమే. అటువంటప్పుడు ఎప్పుడో 2500 సంవత్సరముల క్రిందట స్థాపించిన పీఠములో నేడు పీఠాధిపతులుగా యున్నవారు శంకరునితో సమానముగా ఉందురని చెప్పడము నమ్మలేని మాట. ఆర్యులు నేడు కూడా మనుషుల మీద పెత్తనము చెలాయించుటకు చెప్పుమాటలు తప్ప ఇంకేమి కాదని చెప్పవచ్చును. ప్రజలందరూ మా ఆధీనములోనే ఉండవలెననీ, ప్రజలందరూ మా భక్తులుగానే ఉండవలెనను తలంపుతో అద్వైతులుండడము వలన, నేడు ప్రజలు సాయిబాబాను ఆరాధిస్తుంటే ఓర్చుకోలేక ఆయన దేవుడు కాదని ఆరోపించుచున్నారు. ఈ రోజు సాయిబాబానే కాదు, గతములో బుద్ధున్ని హిందువు కాదని బయటికి త్రోసిన చరిత్ర అద్వైతులదేనని మరచిపోకూడదు. గత చరిత్రను త్రవ్వి చూస్తే తమ మాట వినని వారిని, తమ సిద్ధాంతమును ఆచరించని వారిని, హిందువులనుండి వేరుపరచిన దానివలన, నేడు హిందూమతము ఇతర మతముల ముందర చిన్నదైపోయినది. హిందూమతమును చీల్చి బలహీన పరుస్తూ వచ్చినవారు అద్వైతులే. వీరి మూలముగానే నేడు హిందూమతము పూర్వవైభవమును కోల్పోయినది. నేడు కూడా సాయిని పూజించువారు హిందువులే కాదన్నట్లు విడదీసి మాట్లాడడము వలన హిందువులమే నష్టపోతామను ధ్యాసలేకుండా కాషాయగుడ్డలు ధరించి 'రాజర్షి' అని

పేరు పెట్టుకొని 'రమణానంద' అని పేరుకల్గిన స్వామీజీని నీ గురు పరంపర ఏమిటి? నీవు గురువు ఎలా అయినావు? వేదములు, పురాణములు చదవని వాడివి నీవు గురువు కాలేవు అని వాదించడము హిందువుల సంఖ్యను తగ్గించుకొన్నట్లు కాదా! యని అడుగుచున్నాను. వేదములు తెలిసినవారే, వేదములు చదివిన వారే గురువులు, మిగతావారు కాదు అనడములో మేము తప్ప ఇతరులు గురువులుగా ఉండకూడదను అసూయ కనిపించు చున్నది తప్ప ఇతరము ఏమీ లేదని అర్థమగుచున్నది.

**ప్రశ్న :- (గోవిందానంద) ఒక ముస్లీమ్‌ను తెచ్చి ఇతను గురువు అంటే శాస్త్రములు ఒప్పుకోవు. అనగా ఏ శాస్త్రము ఒప్పుకోదు, ఎన్ని శాస్త్రములు ఉన్నవని రమణానంద అడగడము జరిగినది. అప్పుడు గోవిందానంద అనేక శాస్త్రములున్నవి, ఏవీ ఒప్పుకోవు అని అనడమైనది.**

**నా జవాబు :-** మనుషులను ఒకే విధానమైన ప్రకృతి ధర్మములో దేవుడు పుట్టించాడు తప్ప కులమునకు ఒక విధానము, మతమునకు ఒక విధానమును ఏర్పరచి దేవుడు మనుషులను పుట్టించలేదు. భూమిమీద పుట్టిన మనిషి ఎవడయినా దైవజ్ఞానమును బోధించవచ్చును. ఏ మతము వాడయినా గురువు కావచ్చును. ఒక మతము వాడే గురువుగా ఉండవలెనని ఏ శాస్త్రములోనూ దేవుడు చెప్పలేదు. దేవుడు మనుషులందరికీ సమానమే. మనుషులందరికీ దేవుడు సమానమే. దేవుడు ఎవనినీ నీవు ఫలానా మతస్థుడవని చెప్పి పుట్టించలేదు. మనిషి పుట్టిన తర్వాత మతములను తయారు చేసుకున్నాడు. మతము మనిషి గొప్పతనమునుగానీ, హీనతనమును గానీ తెలుపలేదు. మనిషిలోని దైవజ్ఞానమునుబట్టి మనిషిలోని గొప్పతనము గుర్తించబడును. మతమును బట్టి జ్ఞానము ఉండదు. అలా అనుకోవడము అజ్ఞానమగును. దేవుడు భూమిమీద ఒకే రకము

మనుషులను తయారు చేశాడు. అందరికీ ఒకే రకమైన జ్ఞానమును ఇచ్చాడు. దేవుడు అందరికీ ఒక్కడేయని చెప్పాడు. నోటికి ఊత పదములాగ వేదాలు, శాస్త్రాలు అన్నిటికీ ప్రమాణము అని చెప్పువారు శాస్త్రాలు ఎన్ని ఉన్నాయని అంటే చాలా ఉన్నాయి అని అంటారా? వేదాలు నాలుగున్నా యని చెప్పగలుగువారు, శాస్త్రములు ఎన్ని ఉన్నది ఎందుకు చెప్పలేరు? వారికి సరిపోని ప్రతి దానికి శాస్త్రము ఒప్పుకోదు అనువారు ఏ శాస్త్రము ఒప్పుకోదో చెప్పవచ్చును కదా! ఏమీ తెలియని ప్రజలను మభ్యపెట్టుటకు ప్రతి విషయములోనూ శాస్త్రము సమ్మతించదు అని చెప్పడము అలవాటై పోయినది. హిందువులలోనే స్వాములుగా యున్నవారు ఇలా శాస్త్రమును బూచిగా చూపుచూ ప్రజలను తప్పుదారి పట్టించుచున్నారు. ఒక ముస్లీమ్ మతస్థుడు హిందువుల జ్ఞానము చెప్పకూడదా? ఒక హిందువు ముస్లీమ్‌లకు సంబంధించిన ఖురాన్ జ్ఞానమును చెప్పకూడదా? ఇప్పుడు నేను మూడు మతముల జ్ఞానమును చెప్పుచున్నాను. ప్రస్తుత కాలములో "త్రిమత ఏకైక గురువు"గా ప్రకటించుకొన్నాను. అందరూ నన్ను **"త్రిమత గురువు"** అంటున్నారు. అయితే అద్వైతులు మాత్రము అదెలా అవుతుందని అడ్డుపడుచు శాస్త్రములు ఒప్పుకోవు అని అంటే సరిపోతుందా? ఏ శాస్త్రము ఎక్కడ ఒప్పుకోలేదో వివరముగా చూపించవలసియుండును. సాయిబాబా ఒక మాటను **"సబ్‌కా మాలిక్ ఏక్ హై"** అని అన్నాడు. దాని అర్థము "అందరికీ యజమాని ఒక్కడే"యని ఆ మాటను దేవుడు కూడా కాదనడు. 'అందరికీ దేవుడు ఒక్కడే అధికారి' అనుమాట సత్యమే అయివుండుట చేత ఏ శాస్త్రము దానిని ఒప్పుకోదు అనుటకు అవకాశము లేదు.

శాస్త్రముల విషయములోనికి వస్తే ఏ పూజ అయినా భక్తి మీద ఆధారపడియుంటుంది గానీ శాస్త్రము మీద ఆధారపడియుండదు. అయితే

పూజ విషయములోనూ, తినే విషయములోనూ, పడుకొనే విషయములోనూ ప్రతి కార్యమునకు సంబంధించిన విషయములోనూ కొందరు స్వాములు శాస్త్రమును బూచిగా చూపుచున్నారు. వాస్తవానికి ఈ పనులకు శాస్త్రము నకు ఏమాత్రము సంబంధము లేదు. శాస్త్రము పేరు చెప్పి భయపెట్టు వారికి నిజముగా శాస్త్రములు ఎన్ని ఉన్నాయను విషయము కూడా తెలియదు. ప్రపంచములో యున్నది ఆరు శాస్త్రములే గలవు. అందులో నాలుగు ప్రపంచ సంబంధమైనవి. ఒకటి కొంత ప్రపంచమునకు కొంత పరమాత్మకు సంబంధించినదిగా ఉన్నది. మరి ఆరవ శాస్త్రము పూర్తి దైవమునకు సంబంధించినదిగాయున్నది. మొత్తము ఆరు శాస్త్రములు వరుసగా ఇలా గలవు. 1) గణిత శాస్త్రము 2) ఖగోళ శాస్త్రము 3) రసాయన శాస్త్రము 4) భౌతిక శాస్త్రము 5) జ్యోతిష్య శాస్త్రము 6) బ్రహ్మవిద్యా శాస్త్రము. ఈ ఆరు శాస్త్రములను ఉపయోగించి వాటివాటి పనులను చెప్పవచ్చును. ఏదయినా లెక్కల అవసరమైనప్పుడు గణిత శాస్త్రమును చూడవలసి యుండును. ఏదయినా శరీర సంబంధ అవయవములను గురించిగానీ, ఆరోగ్య అనారోగ్య విషయమును గురించిగానీ చూడవలసి వచ్చినప్పుడు భౌతిక శాస్త్రమును చూడవలసియుండును. అట్లు నాలుగు శాస్త్రములు పూర్తి ప్రపంచ సంబంధమైనవికాగా, కేవలము జ్యోతిష్య శాస్త్రమొకటి కొంత ప్రకృతి, కొంత పరమాత్మ సంబంధ కర్మ విషయముల మీద ఆధారపడి యుండును. మిగతా ఆరవ శాస్త్రము పూర్తి దైవికమైన బ్రహ్మవిద్యా శాస్త్రముగా చెప్పబడుచున్నది.

దైవికమైన మరియు దైవజ్ఞాన సంబంధమైన విషయము ఏదయినా బ్రహ్మవిద్యా శాస్త్రమునసుసరించి నడవవలసియుండును. దేశములో గణిత శాస్త్రము తెలుసు, ఖగోళ శాస్త్రము తెలుసు, రసాయన శాస్త్రము తెలసు, అట్లే భౌతిక శాస్త్రమును గురించి కూడా తెలుసు. ఈ శాస్త్రములను

నేర్పించుటకు పెద్దపెద్ద విశ్వవిద్యాలయములే యున్నవి. అయితే దైవికమైన శాస్త్రము ఏదో చాలామందికి తెలియదు. బ్రహ్మవిద్యా శాస్త్రమయిన భగవద్గీత మన మధ్యలోయున్నా చాలామంది స్వామీజీలు దానిని గుర్తించక వేదములను పట్టుకొని అవే జ్ఞాన సంబంధమైనవని అనుకొంటున్నారు. వేదములలో జ్ఞాన నిర్ణయము లేదనీ, కర్మను కాల్చు జ్ఞానాగ్ని వేదములలో లేదని చాలామందికి తెలియదు. జ్ఞాన సంబంధ విషయములన్నిటికీ, ఆరాధన లన్నిటికీ నేడు సాయి దేవుడా! కాదా? అను విషయమునకు కూడా సరియైన దారిచూపునది భగవద్గీతయైన బ్రహ్మవిద్యా శాస్త్రమే. అయితే నేడు స్వామీజీలుగాయున్న వారు కూడా భగవద్గీతకంటే ముందు పుట్టినవి, భగవద్గీతకంటే ముఖ్యమైనవి వేదములు అంటున్నారు. అంతేకాక వేదములను అనుసరించే భక్తి మార్గములో ముందుకు పోవాలని అంటున్నారు. అన్నిటికీ శాస్త్రమే ఆధారమను వారు వేదములను చూపుచూ వాటినే శాస్త్రము అంటున్నారు. వేదమునకు శాస్త్రము వ్యతిరేఖమైనదనీ, శాస్త్రమునకు వేదము వ్యతిరేఖమైనదనీ, అవి ఒకదాని కొకటి పరస్పర విరుద్ధమైనవని తెలియలేకపోయారు. బ్రహ్మవిద్యా శాస్త్రము అనేక సందర్భములలో వేదములను ఖండించినది. వేదముల వలన దేవుడు తెలియబడడు అని గట్టిగా చెప్పినది. అయినా అద్వైతులు కళ్ళు మూసుకొని వారి పబ్బము గడుపుకొనే దానికి వేదములను గొప్పవనీ, అవియే శాస్త్రములనీ చెప్పుచున్నారు. అది పూర్తి తప్పు.

**ప్రశ్న :- (గోవిందానంద) హైందవములో అనేక శాస్త్రములు గలవు.**

**నా జవాబు :-** హైందవముతో గానీ, క్రైస్థవములోగానీ, ఇస్లామ్‌లోగానీ మూడు మతములలో ఉన్నది మనుషులే. మనుషులకు సంబంధించిన శాస్త్రములు సామాజికముగా మరియు ఆధ్యాత్మికముగా పనికి వచ్చునవి

**"గఖరభౌ జ్యోబ్ర"** అను శాస్త్రములు తప్ప వేరు లేవు. సంస్కృతము నేర్చుకొను వారికి ఆ భాషకు సంబంధించిన శాస్త్రములు కూడా కలవు. అవి విద్యార్థులకు, విధ్వాంసులకు తప్ప ఇతర మనుషులకు పనికిరావు. ఇవి ఉచ్చాటనకు తప్ప అనుభవమునకు పనికి రాని శాస్త్రములైయున్నవి. వాటిని వరుసగా చెప్పితే 1) తర్కము 2) వ్యాకరణము 3) ధర్మము 4) మీమాంస 5) వైద్యము 6) జ్యోతిష్యము అని చెప్పవచ్చును. నేను మనుషులందరికీ పనికి వచ్చు ఆరు శాస్త్రములను చెప్పితే, అందరికీ పనికి రానివి విద్యను నేర్చినాము, మాకు శాస్త్రములు తెలుసు అని చెప్పుకొనుటకు పనికి వచ్చు ఆరు శాస్త్రములను చెప్పుచున్నారు. మేము ఇప్పుడు వాటిని చెప్పకపోతే మమ్ములను అవిద్యావంతుడు అని ఆరోపించుటకు అవకాశముండును కనుక ఎవరికి తెలియని, అందరికీ ఉపయోగపడని శాస్త్రముల వివరమును చెప్పుచున్నాను చూడండి. స్వాములు! విధ్వాంసులు! ఆరు శాస్త్రములను వరుసగా పైన చెప్పియున్నాము. ఇప్పుడు వాటికి ఒక్కొక్క దానికి యున్న వివరమును చెప్పెదను చూడండి.

**1) తర్కము :-** తర్కము అనగా ఊహ, అధ్యాహారము, కారణము, కోరిక. ఆరు శాస్త్రములలో మొదటి శాస్త్రముగా చెప్పబడు తర్కములోనున్న అంశములు (భాగములు) ఇప్పుడు చెప్పాము కదా! మీరు కొంత ఆలోచించండి. 'ఊహ' అనునది ఎవరయినా శాస్త్రమని ఒప్పుకొంటారా? కారణము అడుగుట 'తర్కము' అను పదమునకు సరిపోవునుగానీ దానిని శాస్త్రము అంటే సరిపోతుందా? అట్లే 'తర్కము' అనగా 'కోరిక' అనికూడా కలదు. కోరికలన్నీ శాస్త్రములయితే, ఊహలన్నీ శాస్త్రములైతే శాస్త్రములకు హద్దు పద్దూ యుండదు. ఎవరి ఇష్టమొచ్చినట్లు, ఎవరి కోర్కె ప్రకారము వారు మాది శాస్త్రము అని అనవచ్చును. ఎవరి ఊహ వానికి శాస్త్రమైతే

శాస్త్రములకు పరిమితి లేదు. దేనినయినా శాస్త్రమనవచ్చును. అప్పుడు శాస్త్రబద్ధత అనే దానికి అర్థమే ఉండదు. ఒకడు ఇంద్ర సభలోని రంభను పెళ్ళి చేసుకొన్నట్లు ఊహించుకొని నేను చెప్పునది శాస్త్రము రంభ నా భార్య అంటే సరిపోతుందా? వారు చెప్పు మొదటి శాస్త్రము తర్కము ఎలాగున్నదో గమనించారా? మేము చెప్పు మొదటి శాస్త్రము గణితము. మూడును మూడుతో హెచ్చించితే ఎవరికయినా తొమ్మిదే వచ్చును. 3×3=9 ఇది శాసనముతో కూడుకొన్న శాస్త్రము. కావున అమెరికాలో ఎంచినా, ఆఫ్రికాలో ఎంచినా, ఆకాశములో ఎంచినా, భూమిమీద ఎంచినా ఒకే రకమైన జవాబు ఉండును. శాస్త్రము అనగా శాసనముగా యుండునదే గానీ మారునది కాదు.

**2) వ్యాకరణము :-** ఇది రెండవ శాస్త్రము ఇది కేవలము శబ్ద శాస్త్రమని చెప్పుచుందురు. వ్యాసులు ఎలా వేదముల మంత్రములను పలికారో అలాగే పలకడము వ్యాస శాస్త్రము అని అంటారు. వేదములను కొందరు వేరువేరు యాసలలో పలుకుచుండుటను బట్టి వారి వ్యాకరణము అని అనెడి వారు. ఇలా వ్యాకరణము రెండవ శాస్త్రమైతే అది శబ్ద శాస్త్రమై పోయినది. శబ్దమును శాస్త్రమంటే శాస్త్రమునకుయున్న విలువ పూర్తిగా పోవును. ఇక మూడవ శాస్త్రమును చూస్తాము.

**3) ధర్మము :-** ఈ 'ధర్మము' అను శాస్త్రములో తొమ్మిది అంశములున్నవి. వాటిని వరుసగా చెప్పితే 1) పుణ్యము 2) న్యాయము 3) సామ్యము 4) స్వభావము 5) ఆచారము 6) అహింస 7) వేదోక్త విధి 8) ఉపనిషత్తు 9) యజ్ఞము. వీరు వ్రాసిపెట్టిన వాటిని చూస్తే మనమే అజ్ఞానులమా అని వెను తిరిగి చూచుకోవలసిన అవసరమేర్పడుచున్నది. అలా చూచుకో గలిగితే మేము చెప్పినది సత్యము, వారు చెప్పినది అసత్యమని తెలిసిపోవు

చున్నది. మేము జ్ఞానబోధలు చెప్పునప్పుడు అనేకమార్లు జ్ఞానము, ధర్మము దైవ సంబంధమైనదనీ, నీతి, న్యాయము ప్రపంచ సంబంధమైనదని చెప్పాము. ఇక్కడ చూస్తే ధర్మమే న్యాయమని చెప్పడము పూర్తి విడ్డూరముగా యున్నది. ప్రపంచ సంబంధమైన నీతి అయిన అహింసను ధర్మముగా చెప్పితే, కృష్ణుడు అర్జునునకు యుద్ధము చేయమని చెప్పడము హింసను ప్రోత్సహించి నట్లగును. దాని ప్రకారము కృష్ణుడు అర్జునునకు 'అహింస' అను ధర్మమును కాకుండా, 'హింస' అను అధర్మమును బోధించాడని చెప్పవచ్చును. భగవద్గీత సర్వమానవాళికి ధర్మశాస్త్రము అని చెప్పకుండా అధర్మశాస్త్రమని చెప్పవలసి వచ్చును. అట్లే భగవద్గీతలో వేదములకు వ్యతిరేఖతయుండగా ధర్మము అంటే వేదోక్త విధి అని చెప్పితే, అది భగవద్గీత జ్ఞానమునకే వ్యతిరేఖమైన జ్ఞానమగును. ఇలా చెప్పుచూపోతే అవన్నియు అవక తవక అసంబద్ధత శాస్త్రములే కలవు.

**4) మీమాంస :-** మీమాంస అనగా కర్మ బ్రహ్మ ప్రతి పాదక శాస్త్రము అని చెప్పుచుందురు. ఇది ఎలాంటి శాస్త్రమో చెప్పు వారికే తెలియును.

**5) వైద్యము :-** వైద్యము అనగా రోగ చికిత్సా శాస్త్రము అని చెప్పుచుందురు. వైద్యము ఎప్పటికీ శాస్త్ర సంబంధమైనది కాదు. రోగమును బట్టి వైద్యము మారుచుండును. అలాగే జాగానుబట్టి వైద్యము మారు చుండును. సముద్రము మీద ఇచ్చిన మందును భూమిమీద ఇస్తే అది పని చేయదు. వైద్యము నేర్చుకొన్న దానినిబట్టిగానీ, చదువుకొన్న దానినిబట్టి యుండదు. వైద్యము రోగమునుబట్టి, రోగియొక్క మనో భావమునుబట్టి మారుచుండును. వైద్యము అంతయూ సమయ స్ఫూర్తి మీద ఆధారపడి యుండును. అందువలన వైద్యమును శాస్త్రమని చెప్పుటకు అన్ని విధముల సరిపోదు.

**6) జ్యోతిష్యము :–** జ్యోతిష్యము అనగా జరుగబోవు భవిష్యత్తును గురించి చెప్పునది. ఇంతకుముందు మేము చెప్పిన ఆరు శాస్త్రములలో జ్యోతిష్యము ఐదవ శాస్త్రముగా యున్నది. జ్యోతిష్యము శాస్త్రమే అయినా దానిలో పూర్తి పరిశోధన జరుగలేదు. అందువలన జ్యోతిష్యము నేడు పూర్తి తెలియని శాస్త్రమైయున్నది. వీరు చెప్పిన ఆరు శాస్త్రములలో జ్యోతిష్యమును ఒక్క దానిని శాస్త్రమని మేము కూడా ఒప్పుకొంటున్నాము. మిగతా ఐదు శాస్త్రములు కాదని చెప్పుచున్నాము.

**ప్రశ్న :– (బంగారయ్య–శంకరాచార్య భక్తులు) వేదాలలో ఆచార వ్యవహారములున్నవి వాటిని మీరు ఆచరిస్తున్నారా?**

**నా జవాబు :–** వేదాలలో ఆచార వ్యవహారములు ఎవరికి పనికి వస్తాయో మీరే చెప్పండి. ఏమాత్రము వేరే పని లేకుండా ఆరాధనలు నిత్య కృత్యములుగా యున్న వారికి వేదాలలోని ఆచార వ్యవహారాలు సరిపోతాయి గానీ, సామాన్య ప్రజానీకానికి వేదాలు, ఆచార వ్యవహారాలు పనికి రావు కదా! అందువలన పురోహితులైన బ్రాహ్మణులకు, నిత్య ఆరాధులకు మాత్రమే వేదములు, వేద వ్యవహారములు పనికి వచ్చునని అనుకొంటున్నాను.

**ప్రశ్న :– (రవి శంకర అవధాని. మహానంది దేవస్థాన వేదపండితులు) వేదముల గురించి మీకు ఏమి తెలుసు?**

**నా జవాబు :–** వేదపండితులకు వేదములు తప్ప ఇతరములు ఏమి తెలియవు. కావున వేదములను పొగడడమే వారి పనిగాయుండును. బావిలో దిగిన వానికి బావిలోయుండే పై భాగము మాత్రమే కనిపించునట్లు మిగతా ప్రపంచము ఏమీ కనపరానట్లు వేదములలో పడిన వారికి వేదములే గొప్పగా కనిపించుచుండును. అందువలన తమకు తెలిసినంత మిగతా వారికి తెలియదని చెప్పడము సహజముగా యుండును. దానిప్రకారమే

వేదముల గురించి మీకు ఏమి తెలుసు? అని వారు ప్రశ్నించడమైనది. దానికి మాకు తెలిసినది మేము చెప్పదలచుకొన్నాము. మొదట వ్యాసుడు వేదములను రచించాడు. వేదములతోపాటు ఉపనిషత్తులను వ్రాసిన వ్యాసుడు అవికాక పురాణములను వ్రాశాడు. నాలుగు వేదములను, పురాణములను, ఉపనిషత్తులను వ్రాసిన వ్యాసుడు ప్రజల చేత గొప్పవాడని పించుకొన్నాడు. అయినా వ్యాసుని మెదడులో తనకు సంపూర్ణమైన జ్ఞానము లేదను దిగులు ఉండెను. తనకు సంపూర్ణ జ్ఞానము కావలెననీ, దేవున్ని నిత్యము కోరుకొనుచుండెను. వ్యాసుడు పడిన బాధను గురించి తెలిస్తే వేదముల వలన మనిషిలో సంపూర్ణ జ్ఞానినను తృప్తి కలుగదు అని తెలియుచున్నది. దానివలన వేదములు కూడా ప్రపంచ విద్యలతో సమానమనియే తెలియుచున్నవి. 'కాకి పిల్ల కాకికి ముద్దు' అన్నట్లు వేద పండితులకు వేదములే ముద్దుగా, పెద్దగా కనిపించుచుండును. మేము వేదపండితులము కాము, కావున అవి ముద్దుగాగానీ, పెద్దగాగానీ మాకు కనిపించలేదు.

వేదములను వ్రాసిన వేద వ్యాసునికే వేదములు పెద్దగా కనిపించలేదు. అందువలన జ్ఞానము కొరకు అన్వేషణ చేయడము జరిగినది. చివరికి జ్ఞానమును పొంది తృప్తి పొందడము కూడా జరిగినది. **కృష్ణభగవానుడు యుద్ధరంగములో అర్జునునకు ఆత్మజ్ఞానమును తెలుపగా, తర్వాత అర్జునుడు ఆ విషయములన్నియు పూసగ్రుచ్చినట్లు వ్యాసునికి తెలుపడమైనది. అంత వరకు ఏ జ్ఞానము కొరకు ఎదురుచూస్తున్నాడో అప్పుడు అదే జ్ఞానమే ఆయనకు దొరికినట్లయినది. కృష్ణుడు చెప్పిన జ్ఞానమునంతటినీ అర్జునుని ద్వారా వినిన వ్యాసుడు తనకు తెలిసిన జ్ఞానమును అంతటినీ ఏమాత్రము వదలకుండా గ్రంథరూపము చేశాడు.** అప్పుడు వ్యాసుని చేత తయారయిన గ్రంథమే **'భగవద్గీత'**గా చెప్పబడినది. వ్యాసుడు వ్రాసిన వేదములూ

ఉన్నాయి. అదే వ్యాసుడు వ్రాసిన భగవద్గీత కూడా ఉన్నది. ఇదంతయు మనకు కొంత తెలిసి కొంత తెలియక జరిగిపోయినది. నాకు తెలిసినదే మనగా!

అర్జునుని ద్వారా భగవద్గీతను వినిన వ్యాసుడు భగవద్గీతలో అధర్మములుగా చెప్పబడిన వేదములను గురించి, యజ్ఞములను గురించి వ్రాయడము పెద్ద తప్పు చేసినట్లయినదని తలచి, దానివలన ఎందరినో యజ్ఞములు చేయువారిగా, వేదములు చదువువారిగా ప్రేరేపించినందుకు తనకు తప్పక పాపము వచ్చునని తలచి అటువంటి కర్మనుండి బయటపడు నిమిత్తము భగవద్గీతను వ్రాయాలనుకొన్నాడు. ఆనాడు చందోబద్ధముగా శ్లోకములను వ్రాయుట ఒక వ్యాసునికి మాత్రము వచ్చుట వలన ఆయన ద్వారానే భగవద్గీత గ్రంథము తయారయినది. భగవద్గీతా గ్రంథమును వ్రాయుట వలన తనకు ఏర్పడిన జ్ఞానశక్తి వలన వేదములను, పురాణము లను వ్రాసినందుకు వచ్చిన కర్మంతయూ కాలిపోయినదని వ్యాసుడు సంతోషపడినాడు. భగవద్గీత తెలియకముందు వేదములే గొప్పవని తలచిన వ్యాసుడు, భగవద్గీత తెలిసిన తర్వాత తాను చేసిన పని పాపపు పనియని తలచాడు.

ఆనాడు వ్యాసుడు పడిన వేదన తెలియని నేటి వేదపండితులు వేదములను తెలిసిన తామే గొప్పవారమని అనుకోవడము జరుగుచున్నది. అందువలన ధీమాగా వేదముల గురించి మీకు ఏమి తెలుసు? అని అడగడ మైనది. మాకు వేదములే మాయయని తెలియుట వలన ఇప్పటికయినా మీకు కనువిప్పు కలుగవలెనని ఈ విషయమును తెలియజేయుచున్నాము. ఇప్పటికయినా సత్యమును గ్రహించి భగవద్గీతలో సాంఖ్యయోగమునందు గల 45వ శ్లోకము చెప్పిన **“త్రై గుణ్య విషయా వేదా”** అను విషయమును

మరువకూడదని చెప్పుచున్నాము. అట్లే విజ్ఞానయోగమను అధ్యాయమున గల 14వ శ్లోకమున చెప్పిన **"గుణమయీ మమ మాయా"** అనుమాటను కూడా మరువకూడదని చెప్పుచున్నాను. ఈ రెండు శ్లోకములను భగవంతుడు భగవద్గీతలో చెప్పియుండుట వలన ప్రతి ఒక్కరు గీతలోని రెండు శ్లోకములను మరువకూడదు. వేదములను గురించి మీకు ఏమి తెలుసు అని అడిగారు కదా! అందువలన వేదముల గురించి నాకు తెలిసినది నేను చెప్పాను.

**ప్రశ్న :- (గోవిందానంద) అల్లాకు ఈశ్వరునికి భేదమున్నది. మీరు అల్లా ఈశ్వరుడు ఒక్కటేనని సాయిబాబా చెప్పాడంటే మేము ఒప్పుకోము.**

**నా జవాబు :-** సాయిబాబా గారు అల్లాకు, ఈశ్వరునికి భేదము లేదు అని చెప్పాడంటే, అందులో సత్యాసత్యములు ఆలోచించకుండా అలా కాదు, ఇద్దరికి భేదమున్నదని గోవిందానంద స్వామీజీ చెప్పడము జరిగినది. అట్లు కాదు అని అడ్డు చెప్పినప్పుడు ఎలా ఒకటికాదో, ఎలా భేదమున్నదో వివరముగా చెప్పవలసిన బాధ్యత ఆయన మీద ఉన్నది. అయితే ఆయన అడ్డు తగిలి మాట్లాడినట్లు ఏ దానికి వివరమును చెప్పడము లేదు. దైవత్వమునకు మతములున్నవా?యని మేము ప్రశ్నించుచున్నాము? తెలుగు భాషలో హిందువులందరూ దేవున్ని ఈశ్వరుడని చెప్పడము జరుగుచున్నది. దానివలన దేవుడన్నా, ఈశ్వరుడన్నా ఒక్కటేనని తెలిసిపోయింది. అదే విధముగా ముస్లీమ్‌లందరూ దేవున్ని అల్లాహ్ అనడము జరుగుచున్నది. దానివలన దేవుడనినా, అల్లాహ్ అనినా ఇద్దరూ ఒక్కటేనని తెలియుచున్నది. తెలుగు భాషలో హిందువులు ఈశ్వరుడని చెప్పినా, అరబ్బీ భాషలో ముస్లీమ్‌లు అల్లాహ్ అని చెప్పినా వారి అంతఃరంగములోని భావము దేవుడనియే ఉండుట వలన అల్లాహ్ అనినా, ఈశ్వరుడు అనినా

ఇద్దరూ ఒకటేనని మేము చెప్పుచున్నాము. హిందువులలో గోవిందానంద ఒక స్వామియైయుండి మనుషలను ఒక్కటిగా కలుపు మాటలను చెప్పక, ఒక్కటిగాయున్న మనుషలను విడదీయునట్లు మాట్లాడడము స్వాములకు తగునా?యని మేము అడుగుచున్నాము. అజ్ఞానులు మా దేవుడువేరు, మీ దేవుడు వేరు అనినా, అలాకాదు అందరి దేవుడు ఒక్కడేయని చెప్పవలసింది పోయి, మీరు స్వాములయివుండి మీ దేవుడు వేరు, మా దేవుడు వేరు అన్నట్లు అల్లాహ్, ఈశ్వరుడు ఒకటికాదు అనడము మంచిదా!యని అడుగుచున్నాము.

నేను ఒక హిందువుగా ఈశ్వరుడు అంటే అధిపతియని అర్థము గలదనీ, ప్రపంచమునంతటికీ అధిపతియైన దేవున్ని 'ఈశ్వరుడు' అనడములో అర్థముతో సహా సరిపోవునని చెప్పుచున్నాము. ఇకపోతే ముస్లీమ్‌లందరూ వారి భాషలో దేవున్ని 'అల్లాహ్' అనడము జరుగుచున్నది. అరబ్బీ భాషలో అల్లాహ్ అంటే దేవుడని వారు చెప్పుకొనుచుందురు. ఇక్కడ ముస్లీమ్‌లకు కూడా తెలియని సత్యము ఒకటి కలదు. అదేమనగా! అల్లాహ్ అను పదము సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానములో ఉండుట వలన, జిబ్రయేల్ అదే జ్ఞానమునే ముహమ్మద్ ప్రవక్త గారికి చెప్పునప్పుడు 'అల్లాహ్' అను పదమును ఉపయోగించి చెప్పాడు. అప్పుడు జిబ్రయేల్ ద్వారా ముహమ్మద్ ప్రవక్త గారు విని, దానిని విన్నట్లే తన అనుచరులకు తెలిపాడు. అప్పటినుండి 'అల్లాహ్' అను పదము ముస్లీమ్‌లలో చెప్పబడుచున్నది. ఈశ్వరుడు అని అంటే అధిపతియని అర్థమున్నట్లు సృష్ట్యాదిలో చెప్పబడిన అల్లాహ్ అంటే ప్రత్యేకమైన అర్థము కలదు. అంతేకాక **సృష్ట్యాదినుండి ప్రపంచములో యున్న భాష తెలుగు భాష.** 'అల్లాహ్' అను పదము కూడా నేటికీ తెలుగు పదముగానే యున్నది. **'అల్లాహ్'** అను పదమును విడదీసి చూస్తే ఇలా

కలదు. **'ల్లాహ్'** అనగా తెలుగు భాషలో **'అంతు'** అని అర్థము. **"అ"** అనగా లేదు, కాదుయని అర్థము కలదు. **'అల్లాహ్'** అను పూర్తి పదమునకు **అంతులేని వాడనీ, దేవునికి హద్దులు లేవు కావున ఆయనను అల్లాహ్ అనడము** జరుగుచున్నది. అంతు లేనివాడు, ఎల్లలు లేనివాడు, హద్దులు లేనివాడు దేవుడు అయినందున స్వచ్ఛమయిన తెలుగు పదము ప్రకారము అల్లాహ్ అనడమైనది. **'ఈశ్వరుడు'** అన్నా దేవునికి సంబంధించిన గొప్పతనమే తెలియుచున్నది. అలాగే **'అల్లాహ్'** అనినా దేవునికి గల గొప్పతనమే తెలియుచున్నది. అదియునుగాక రెండూ తెలుగు పదములే అయివుండి తెలుగు భాష ప్రకారము అర్థము నిచ్చుచుండుట వలన, అల్లాహ్ అనినా ఈశ్వర్ అనినా రెండు ఒకే దేవునికి చెప్పిన పదములని చెప్పవచ్చును. ఏ మతములో పెద్దలయినా అందరి దేవుడు ఒక్కడేయని చెప్పడము గొప్పతన మగునుగానీ, అట్లుకాదు మీ దేవుడు వేరు, మా దేవుడు వేరని చెప్పడములో అజ్ఞానమే కనిపించునుగానీ జ్ఞానము అనిపించుకోదు.

సర్వ ప్రపంచమునకంతటికీ సృష్టికర్త ఒక్కడే గలడు. గత మూడు యుగములలో ఒకే ఇందూ సమాజముండెను. అందువలన రెండవ దేవుడు అను ప్రసక్తే లేకుండా ఉండెడిది. కొందరు చిన్న చిన్న దేవతలను అనగా విష్ణు, ఈశ్వర, బ్రహ్మ అను త్రిమూర్తులను ఆరాధించుచుండినా అసలయిన దేవుడు త్రిమూర్తులను కూడా సృష్టించినవాడు పరమాత్మ ఉన్నాడను జ్ఞానులుండెడివారు. మూడు యుగములు గడచిపోయి నాల్గవ కలియుగము వచ్చిన తర్వాత కొంతకాలమునకు మతముల విభజన రావడముతో అజ్ఞానము చేత మతమునకు ఒక దేవుడు అని ప్రచారమయినది. అంతవరకు ఏకముగాయున్న దేవున్ని అజ్ఞానము చేత వేరుగా చెప్పుకోవడము జరిగినది. మతముల మాయను వదలి మనుషులందరూ ఒక్కటే, అందరికీ ఒక్కడే దేవుడు అను సిద్ధాంతముతో చూచితే రెండవ దేవుడే లేడని తెలియ

గలదు. అదే విషయమునే మేము చెప్పుచున్నాము. మతమను మాయలో పడిన వారు దేవుళ్ళ విభజన విడిచి **'ఏకం బ్రహ్మ' (దేవుడు ఒక్కడే)** అను మాటమీదికి వస్తే ఈశ్వరుడన్నా, అల్లా అనినా ఒక్కటేయని తెలియగలదు. ఇద్దరు వేరు అని ఎవరనినా వారు మతమను మాయలో చిక్కుకొన్న అజ్ఞానులుగా లెక్కించబడుదురు.

**ప్రశ్న :- (ప్రేక్షకులు గోవిందానందను అడిగిన ప్రశ్న) సర్వమానవులను సృష్ఠించిన వాడు ఎవడు? సూటిగా జవాబు చెప్పండి. (దానికి ఒక అర నిమిషము ఆలోచించి గోవిందానంద స్వామి 'భగవంతుడు' అని చెప్పాడు.)**

**నా జవాబు :-** ప్రశ్న అడిగిన వ్యక్తి ఒక స్త్రీ. గోవిందానంద చెప్పిన జవాబు బహుశా వినే వారందరికీ సరిపోయి ఉండవచ్చును. కొంత జ్ఞానము తెలిసిన వ్యక్తిగా నాకు ఆ జవాబు ఏమాత్రము సరిపోలేదు. అంతేకాకుండా ఈగకు, తూనీగకు ఎంత తేడా గలదో అంత తేడా సృష్ఠికర్త అయిన దేవునికి, సృష్ఠింపబడిన భగవంతునికి గలదు. 'దేవుడు' అనగా సృష్ఠించు సృష్ఠికర్త కాగా, 'భగవంతుడు' అనగా భగము (గర్భము) నుండి సృష్ఠింపబడినవాడని అర్థము. మనిషి ఆకారములో సృష్ఠింపబడినవాడు **భగవంతుడు.** ఏ ఆకారము లేని సృష్ఠికర్త **దేవుడు.** దేవుని అంశ భగవంతునిగా సృష్ఠింపబడ వచ్చును గానీ, దేవుడు సృష్ఠింపబడడు. సర్వ జీవులను సృష్ఠించువాడు ఎప్పటికీ సృష్ఠింపబడడు. దేవుని ఆత్మ అనబడు దైవశక్తి కొంత మనిషిగా వచ్చి, భూమిమీద జ్ఞానమును చెప్పిపోవును. అలా వచ్చిన దైవశక్తిని **'భగవంతుడు'** అని అనవచ్చును. భగవంతుడు దైవమే అయినా ఆయన ఎవరినీ సృష్ఠించు స్థితిలో ఉండడు. అందువలన సృష్ఠించు వానిని సృష్ఠికర్త యని చెప్పవచ్చును లేక దేవుడు అని కూడా

చెప్పవచ్చును. అట్లు కాకుండా సర్వమానవులను సృష్ఠించిన వాడు ఎవడు అన్నప్పుడు దేవుడనియే చెప్పాలి గానీ భగవంతుడు అని చెప్పకూడదు. భగవంతుడు అని చెప్పడము వలన ఆ మాటను చెప్పువాడు దేవునికి భగవంతునికి తేడా తెలియనివాడని సులభముగా తెలియవచ్చును. దేవునికి భగవంతునికి తేడా తెలియని వానికి దేవున్ని గురించిన జ్ఞానము ఎంతమటుకు గలదో అర్థమయి పోగలదు. నేడు పైకి ఎంతో పెద్ద స్వామీజీలుగా కనిపించువారికి కూడా దేవునికి భగవంతునికి మధ్యలో గల తేడా తెలియదనియే చెప్పవచ్చును. దేవుడనినా, భగవంతుడనినా ఇద్దరు ఒకటే కదా!యని అంటున్నారు. నాగుపాముకు, పూడుపాముకు గల తేడా తెలియని వారికి పామును గురించిన జ్ఞానము తెలియదని చెప్పినట్లు, దేవునికి, భగవంతునికి తేడా తెలియనివానికి దేవుని గురించిన జ్ఞానము ఏమాత్రము తెలియదని చెప్పవచ్చును. ఇప్పుడు మనుషులను సృష్ఠించిన వాడు ఎవడు? అన్నప్పుడు గోవిందానంద భగవంతుడని జవాబు చెప్పాడంటే అతనికి దేవుని విషయము ఏమాత్రము తెలియదని అర్థమగు చున్నది. దేవుడు ఎవరు? అను విషయము తెలియనివాడు 'సాయిబాబా దేవుడు కాదు' అని ఆరోపించుచున్నాడంటే ఆయనకు ఆ విషయము పూర్తి తెలిసి ఆరోపించడము లేదని అర్థమగుచున్నది. దేవుని విషయము తెలియకున్నా ఇతను దేవుడు, ఇతను దేవుడు కాదు, ఇతను భగవంతుడు అను విషయమును తెలియనివాడు సాయిబాబా దేవుడు కాదను వాదనకు వచ్చాడంటే అతనికి విషయము తెలిసి రాలేదని తెలియుచున్నది. అలా వాదిస్తే తనకు పేరు వస్తుందను ఉద్దేశ్యముతో వచ్చాడని అర్థమగుచున్నది. సర్వసాధారణముగా మనిషిగా కనిపించు వానిని ఎవరూ దేవుడని అనకూడదు. అతను దైవాంశముతో పుట్టినవాడయినా అతనిని 'భగవంతుడు'

అని అనాలిగానీ, దేవుడని అనకూడదు. అటువంటి వివరము తెలియకుండా ఒక మనిషిని దేవుడు కాదని వాదించడము అజ్ఞానమే అగును. సాయిబాను దేవుడని మేము కూడా చెప్పలేదు కదా! ఆయనను ఒకవేళ అంటే భగవంతుడని అనవచ్చును.

**ప్రశ్న :- (గోవిందానంద) కలియుగ దైవము సాయిబాబా అని అంటున్నారు. ఆ మాటను నేను ఒప్పుకోను. వెంకటేశ్వర స్వామియే కలియుగ దైవము. కలియుగ దైవము ఒక్కడే ఉంటాడుగానీ, ఇద్దరు లేక ముగ్గురు ఉండరు.**

**నా జవాబు :-** వెంకటేశ్వర స్వామి పురాణాలలో సృష్టింపబడిన వాడు. సాయిబాబా అయితే చరిత్ర గల మనిషి. ఇద్దరిలో ఒక్కరే కలియుగ దైవముగా ఉండవలెననడము ఒక పదవిలో ఒక్కరే ఉండాలి. ఇద్దరు ఎలా ఉంటారు అన్నట్లున్నది. కలియుగ దైవము అనుమాట ఒక పదవి లాంటిది కాదు. కలియుగ దైవము అనుమాట ప్రజల నుండి వచ్చు మాటయేగానీ, ముందే తగిలించుకొను బోర్డులాంటిది కాదు. కలియుగ దైవము అను పేరు ఎందరికయినా రావచ్చును. అది వారి వారి భక్తిని బట్టి యుండును. ఉదాహరణకు చూస్తే ఉత్తర భారతదేశములో కాళీమాతను చాలామంది ఆరాధించుచుందురు. అక్కడివారు మిగతా దేవతలకంటే కాళీమాతను ఎక్కువగా పూజించుట వలన ఆ ప్రాంతములో కలియుగ దైవము అంటే కాళీమాత అనియే చెప్పుదురు.

ఉత్తరప్రదేశ్‌లో ఆగ్రా, మధుర ప్రాంతములో శ్రీకృష్ణున్ని ఎక్కువగా ఆరాధించడము జరుగుచున్నది. ఆ ప్రాంతము చుట్టుప్రక్కల మధుర, బృందావనమునకు అన్నిచోట్ల ఎక్కడ చూచినా శ్రీకృష్ణుని దేవాలయములే కనిపించును. అక్కడ ఎక్కువగా కృష్ణుని భక్తులుండుటచేత వారి భక్తిని అనుసరించి శ్రీకృష్ణుడే కలియుగదైవము అని అంటారు. దానిని మనము

కాదనే దానికి అవుతుందా? వారివారి భక్తినిబట్టి ఈ విషయముండును గానీ, ఒకరి నిర్ణయము మీద ఆధారపడి యుండదు. తర్వాత భారతదేశము లోనే మధ్యప్రదేశ్ మొదలుకొని ఆంధ్రరాష్ట్రము వరకు సీతా రామున్ని ఎక్కువగా గుడికట్టి ఆరాధించడమున్నది. ప్రతి పల్లెటూరిలో కూడా రాముని గుడి తప్పకయుంటుంది. ప్రతి దినము ఆ గుడిలో రాముని భజన చేసెడివారు. అందువలన అయోధ్య మొదలు పెట్టుకొని ఆంధ్రవరకు శ్రీరామున్నే కలియుగదైవము అని చెప్పుచున్నారు. ఆంధ్రాలో భద్రాచలము, ఒంటిమిట్ట మొదలగు పెద్ద దేవాలయములు శ్రీరామునికి గలవు. పూర్తి దక్షిణ భారతదేశములోనికి వస్తే ఈశ్వర లింగమున్న దేవాలయములు ఎక్కువగా గలవు. దక్షిణ దేశమంతా ఈశ్వరున్నే ఎక్కువగా ఆరాధించుచూ ఆయననే దైవము అని అంటున్నారు. ఈ విధముగా కాకుండా తిరుపతిలో వెంకటేశ్వర స్వామి, శబరిమలలో అయ్యప్పస్వామి, భద్రాద్రిలో రాముడు, శ్రీలంకలో రావణబ్రహ్మ, కలకత్తాలో కాళీమాత మొదలగు ప్రాంతీయ దేవతలందరూ కలియుగ దైవముగానే చెప్పబడుచున్నారు. ఇందులో ఎవరినీ కాదు అనిగానీ, అవును అనిగానీ అనుటకు వీలులేదు. వారివారి భక్తిని బట్టి వారు కొలుచు దేవున్ని గొప్పగనే చెప్పుకొనుచుందురు. ఇదంతయు సహజముగా చెప్పబడునదే గానీ, ఒక హోదానుబట్టి నిర్ణయము చేసి చెప్పునది కాదు.

పైన చెప్పిన దేవుళ్ళలో పురాణ దేవుళ్ళే ఎక్కువగా యున్నారు. ప్రస్తుత కాలములో చరిత్ర గలిగి మనుషులుగాయున్న వానిని కూడా కొందరు గొప్పగా చెప్పుచున్నారు. శిరిడి సాయిబాబా చనిపోయి వంద సంవత్సరములు జరిగినా, ఆయనను కలియుగ దైవము అనడము జరుగు చున్నది. ఇకపోతే సత్యసాయిగా కనిపించు మనిషిని నడయాడే దైవము అని అంటున్నారు. ఇలా వారివారి భక్తినిబట్టి వారు ఆరాధించు దేవుళ్ళను

గానీ, మనుషులనుగానీ గొప్పగా చెప్పుచున్నారు. కలియుగ దైవము ఒక్కడే ఉండాలి ఇద్దరు ఉండకూడదనిగానీ, ఫలానా అర్హతలున్నవారే కలియుగ దైవము అనిగానీ ఎక్కడయినా ఎవరైనా చెప్పారా? లేకపోతే ఎక్కడయినా ఏ గ్రంథములోనయినా వ్రాసియుంచారా? అటువంటి నిర్ణయము ఎక్కడా లేనప్పుడు, ఎవరూ చెప్పనప్పుడు మధ్యలో గోవిందానంద చెప్పడములో ఆయన ఉద్దేశ్యము ఏమిటి? అని యోచించి చూస్తే, ఆయన ఎదుటి వాడు మాట్లాడే మాటను అసూయతో కాదనడము తప్ప ఇంకొకటి లేదని తెలియు చున్నది.

ఒక వ్యక్తిని దేవుడని చెప్పుటకుగానీ, దేవుడు కాదు అని చెప్పుటకుగానీ ఆ వ్యక్తి చెప్పిన జ్ఞానమును బట్టి యుండును. మనిషిగా పుట్టినవాడు దేవుడుకాడు కానీ, దేవుని అంశ అయిన భగవంతుడని చెప్పవచ్చును. భగవంతుడు దేవుని అంశతో వచ్చిన వాడు కనుక, ఆయనను గౌరవార్థము దేవుడని చెప్పవచ్చునుగానీ, వాస్తవానికి ఆయన భగవంతుడే యగును. దేవుడు అనగా ఆయన ముఖ్యమైన మూడు ధర్మములు కలిగి యున్నాడు. అవి ఏవియనగా నామ, రూప, క్రియా రహితుడు దేవుడని చెప్పవచ్చును. దేవునికి పేరుండదు, రూపముండదు. అట్లే పని చేయు వాడు కాదు. ఈ పద్ధతిగా యున్న దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఎవరికీ తెలియదు. అటువంటప్పుడు ఎప్పుడయినాగానీ తన జ్ఞానమును తానే ఇతరులకు చెప్పవలసియున్నది. అలా చెప్పవలసి వచ్చినప్పుడు దేవుడు స్వయముగా ఒక మనిషి ఆకారమును పోలిన బొమ్మను చేసి, దానిలోనికి తన ఆత్మనే ఊది సజీవముగల మనిషిగా పంపును. అలా వచ్చిన మనిషిని భగవంతుడు అని అంటున్నాము. భగవంతుని వేషములో వచ్చిన దేవుడు అప్పుడు ప్రజలకు తన జ్ఞానమును తెలియజేసి పోవును.

అలా మనిషి ఆకారములో వచ్చిన దైవమును నిజమైన దైవము అని అనవచ్చును. ద్వాపర యుగములో కృష్ణుడు భగవంతునిగా వచ్చాడు, కావున ఆయనను ద్వాపర యుగ దైవము అని చెప్పవచ్చును. కలియుగములో భగవంతుడు వస్తే ఆయనను మాత్రము కలియుగ దైవము అనవచ్చును.

**ప్రశ్న :- (గోవిందానంద) సన్న్యాసికుండ వలసిన లక్షణాలేమిటి? ప్రతిరోజు గడ్డము గీకువాడు సన్న్యాసి కాదు.**

**నా జవాబు :-** సన్న్యాసత్వము అనునది మనుషులకు తెలియలేదని దేవుడే భగవంతునిగా వచ్చినప్పుడు సన్న్యాసత్వమును గురించి ప్రత్యేకముగా చెప్పడమైనది. అట్లు దేవుడే దిగివచ్చి చెప్పినా స్వామీజీలయిన వారికి, సన్న్యాసత్వము తీసుకొన్న వారికి, సన్న్యాసత్వమును గురించిన అవగాహన లేకపోవడము ఆశ్చర్యపడవలసిన విషయము. స్వామీజీలు పెంచే గడ్డాలకు సన్న్యాసత్వమునకు ఏమాత్రము సంబంధము లేదు. అయినా సన్న్యాసు లందరి చూపు తమ గడ్డము మీదనే ఉన్నది. అందువలన గడ్డమును కొరిగించుకొన్న రమణానందను ఎక్కిరించునట్లు నీవు సన్న్యాసివా? నిత్యము గడ్డమును కొరిగించువాడు సన్న్యాసులవుతారా అని అడిగాడు. దానికి రమణానంద గారు నేను మహర్షిని నేను ఎలా అయినా ఉండవచ్చును. నేను మీలాగా సన్న్యాసిని కాను రాజర్షిని అని అన్నాడు. ఈ విషయమును వినిన ప్రజలు కొంత సందిగ్ధములో పడుట సహజము. అందువలన ఇక్కడ ప్రజలకు అర్థమగులాగున కొంత వివరమును ఇవ్వాలనుకొన్నాను. ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో ఆత్మ సంయమ యోగమను అధ్యాయమున మొట్టమొదటి శ్లోకము సన్న్యాసత్వమును గురించి చెప్పినదే చూడండి.

(5).1 శ్లో॥ అనాశ్రితః కర్మఫలమ్ కార్యం కర్మకరోతి యః ।
స సన్న్యాసీచ యోగీచ ననిరగ్ని ర్నచాక్రియః ॥

**భావము :- కర్మఫలమును ఆశ్రయింపక కార్యములు చేయవలెనని తలచి ఎవడు చేయునో వాడే నిజమైన సన్న్యాసి, నిజమైన యోగి. అగ్ని లేనటువంటి వాడు, పనులు మానుకొన్నవాడు యోగికాడు మరియు సన్న్యాసి కాడు.**

**వివరము :-** యోగిని సన్న్యాసి అనియు, సన్న్యాసిని యోగి అనియు పిలువ వచ్చును. సన్న్యాసి అనినా, యోగి అనినా రెండు ఒకే అర్థమని తెలియాలి. ఈ అధ్యాయములో మొదటనే సన్న్యాసి అంటే ఎవరని అర్థమగులాగున భగవంతుడు చెప్పాడు. నిత్య జీవితములో బ్రతుకుతెరువు కోసము ఎందరో ఎన్నో పనులను చేయుచున్నారు. దీనికి సమతగా **'కూటి కొరకు కోటి పనులన్నారు".** ఎన్నో పనులతో కూడుకొన్న మన జీవితములో అన్ని పనులు మంచివి ఉండవు, అట్లే అన్ని పనులు చెడ్డవి ఉండవు. పనులు మంచివైనా, చెడువైనా మనమెందుకు చేస్తున్నాము అనుకుంటే, పని చేయుట వలన దానికింత కూలియను ప్రతిఫలితముండును. ఒకరోజు పని చేయుట వలన 100 రూపాయలు ప్రతిఫలితము వస్తున్నదనుకొందాము. ఇలా ఒక్కొక్కరి పని వేరు మరియు ఫలితము వేరుగా ఉండును. రోడ్డు ప్లాన్ వేయు ఇంజనీరుకు ఒక ఫలితము, అదే రోడ్డు పని చేయువానికి ఒక ఫలితముండును. ఒక మనిషికి రోజుకు కొంత కంటికి కనిపించు ఫలితమున్న విషయము అందరికీ తెలిసినదే.

అందరికీ తెలియని విషయము కూడా ఒకటున్నది. అదేమనగా! మనిషి చేయు ప్రతి పనిలోనూ కంటికి కనిపించని ఫలితము కూడా ఒకటి ఉన్నది. కంటికి కనిపించు ఫలితము డబ్బు రూపముగా, కనిపించని ఫలితము కర్మ రూపముగా ఉన్నది. కర్మ కనిపించనిది కావున ఏ పనిలో

ఎవనికెంత కర్మవచ్చునది చెప్పలేము. బయటి ఫలితములను సంపాదించు కొన్న దానినిబట్టి వాడు ఇంత ధనికుడు, వీడు ఇంత పేదవాడు అని చెప్పవచ్చును. కనిపించని ఫలితమైన కర్మనుబట్టి ఎవడెంత కర్మపరుడో చెప్పలేము. దీనినంతటిని బట్టి మండుచున్న అగ్నికి క్రింద కనిపించు కట్టెలు పైన కనిపించని గాలి తగులుకొని ఉన్నట్లు, జరుగుచున్న పనికి ఒక ప్రక్క కనిపించు ఫలితము మరియొక ప్రక్క కనిపించని ఫలితము ఉన్నది. రూపాయి బిళ్లకు బొమ్మ బొరుసులాంటిదే కార్యమునకు కనిపించు, కనిపించని ఫలితములని తెలియాలి. మనకు తెలియని మరొక విషయ మొకటి ఉన్నది. అదేమనగా! చేయుచున్న పనిలో కంటికి కనిపించని కర్మను లేకుండా చేసుకోవడము. చేసిన పనికి కూలీ రూపాయలుగా తీసుకొంటే బొమ్మ బొరుసు రెండు రూపములు ఉండును. వేరే ధాన్య రూపముగానో, వస్తురూపముగానో తీసుకొంటే దానికి ఒక రూపము తప్ప రెండు రూపములు ఉండవు. అట్లే కనిపించు ఒక ఫలితము తప్ప కనిపించని రెండవ ఫలితము లేని కార్యములు, వాటిని చేయు విధానము కూడా ఉన్నదని భగవంతుడు తెలియజేశాడు. అది ఎట్లనగా! ఒక కార్యము జరుగునప్పుడు కర్మ ఎలా తగులుకొనుచున్నదో మొదట తెలుసుకోవాలి. తర్వాత కర్మ అంటని విధానమును తెలుసుకోవచ్చునన్నాడు. ఇదంతయు ఇతర దేశాలకు పోయి తెలుసుకోవలసినది కాదు, మన దేహమునందే తెలుసుకోతగినది. కావున చాలా సులభముగా ఉండును. ఒక కార్యము చేయుచున్నప్పుడు ఆ కార్యము జరుగుటకు కారణము ఏమిటని మొదట తెలుసుకొందాము. గత జన్మల సంచితకర్మ ప్రస్తుతమున్న జన్మలో ప్రారబ్ధ కర్మయై నిత్యము అనుభవమునకు వస్తుండును. ఒక కార్యము జరగాలంటే ఆ ప్రారబ్ధమే మొదటి కారణము. ప్రారబ్ధము ప్రకారము ఒక విషయము మొదట మనస్సుకు జ్ఞప్తికి వచ్చును. ఆ విషయమును వెంటనే బుద్ధి

గ్రహించి, ఆ సమయమునకు అందుబాటులో ఉన్న గుణములతో యోచించును. గుణములు రెండు రకములుగా ఉన్నవి. కావున బుద్ధి యొక్క యోచన కూడా రెండు రకములుగా ఉండును. ఒక రకము యొక్క గుణముల ప్రకారము బుద్ధి యోచన ఆ విషయము యొక్క పని చేయమని సూచిస్తే, రెండవ రకము యొక్క గుణముల ప్రకారము ఆ పని చేయవద్దు అని బుద్ధి సూచిస్తుంది. ఇట్లు అందులో లాభముంటుందని ఒక రకము, అందులో లాభము ఉండదని మరొక రకము, ఇది మంచి పనేనని ఒక రకము అంటే, దానికి వ్యతిరేఖముగా ఇది చెడు పనేయని మరొక రకము చెప్పుచుండును. ఇట్లు అన్ని రకములుగా యోచన చేయడమే బుద్ధి యొక్క కర్తవ్యము. అట్లు యోచన చేయబడిన విషయమును వెంటనే ప్రక్కనే ఉన్న చిత్తము గ్రహించి ఆ పని చేయమనో, చేయవద్దనో ఏదో ఒక దానిని నిర్ణయించును. అట్లు నిర్ణయించడమే చిత్తము యొక్క పని. ఆ నిర్ణయము ఏదియైన చిత్తము తన ఇష్టానుసారము చేయదు. అది ఒక ఆధారముతోనే నిర్ణయము చేయును. ఆ ఆధారము ఏమిటనగా! అప్పటి ప్రస్తుత ప్రారబ్ధ కర్మ ఏది జరుగవలెనని చూపిస్తున్నదో, దానినే చిత్తము చిత్తగించి, ఆ విషయమును అమలు చేయవలసిన విధానమును మనస్సుకు తెలియజేయును. మనస్సు వెంటనే ఆ విషయమును శరీర బాహ్యేంద్రియములకు చేర్చును. మనస్సు ఆదేశించినట్లు శరీర అవయవములు పని చేయును. ఇదంతయు ఒక కార్యము జరుగుటకు నిర్ణయింపబడిన శరీర యంత్రాంగమని తెలియాలి. ప్రారబ్ధకర్మ కార్యరూపమౌటకు మనస్సు, బుద్ధి, చిత్తము శరీర అవయవములు పది మొత్తము 13 పాత్రధారులై ఉన్నవి.

ఒక కార్యము జరుగునప్పుడు శరీర యంత్రాంగమెలా ఉన్నదో గ్రహించాము కదా! ఇందులో జీవుని పాత్ర ఏమీ లేదు. జీవుడు సాక్షిగా

చూస్తూవుండువాడే, ప్రారబ్ధకర్మ అమలుకు రావడములో మనస్సు, బుద్ధి, చిత్తము వాటివాటి పని చేయుచున్నప్పుడు జీవుడు కూడా అక్కడే ఉన్నాడు. కనుక ఆ విషయమంతయూ జీవునికి తెలుస్తూనే ఉండును. అట్లే ఒక దాని విషయము మరొక దానికీ తెలుస్తూనే ఉండును. శరీరములో జీవుడు, మనస్సు, బుద్ధి, చిత్తము అహము అను ముఖ్య అంతరంగములైన వాటిలో కర్మ కార్యరూపమౌవుటకు మనస్సు, బుద్ధి, చిత్తము మూడు మాత్రమే పాత్రధారులై ఉండగా జీవాత్మ, అహము ఏమాత్రము సంబంధము లేనివై ఉన్నవి. కార్యము జరుగుటకు వీటి సంబంధము ఏమాత్రము లేదు. మనో, బుద్ధి, చిత్తముల స్పందన ప్రకారము శరీరము ద్వారా కార్యము జరుగుచున్నప్పుడు ఆ కార్యములో ఉన్న బాధలుగాని, సుఖములుగాని అనుభవించువాడు జీవాత్మ. జీవుడు శరీరములో కష్టసుఖముల అనుభవములను పొందుటకే ఉన్నాడని తెలియాలి. ఒక సమయములో లడ్డు తినవలెనను జ్ఞప్తి రావడము, అప్పటి ఆశ గుణము ప్రకారము బుద్ధి తినమని యోచించిన దానిని చిత్తము నిర్ణయించడము, శరీరములోని చేతులు తినిపించడము, నోరు తినడము, అందులోని రుచి యొక్క అనుభూతిని నాలుక మనస్సుకు అందివ్వడము, దానిని వెంటనే మనస్సు లోపలనున్న జీవునికి చేర్చడము, జీవుడు ఆ అనుభూతిని పొంది సంతోషించడము జరుగుచున్నది. ఆ విధముగానే వైద్యము ప్రకారము మందు తినవలసి వచ్చినప్పుడు తినే మందులోని చేదును కూడా మనస్సు ద్వారా అనుభవించి బాధపడవలసి వస్తున్నది. పని చేయించునది మనో, బుద్ధి, చిత్తములుకాగా సుఖదుఃఖములు అనుభవించువాడు జీవాత్మ. ప్రారబ్ధము యొక్క ఉద్దేశ్యము జీవున్ని అనుభవింప చేయడమే కావున దానికి తగినట్లు శరీర యంత్రాంగ మంతయు అమర్చి పెట్టబడినది.

ఇంతవరకు అహము యొక్క పని ఏమిటో తెలియలేదు కదా! ఇప్పుడు చూస్తాము. ఒక కార్యములో మనస్సు, బుద్ధి, చిత్తములు శ్రమించగా జరిగిన పనిలోని అనుభవమును జీవుడు పొందుచుండగా, ప్రక్కనే ఉన్న అహము ఈ పని మొత్తమునకు నీవే అధిపతివి, నీ వలననే ఈ పని జరుగు చున్నదని జీవునికి బోధిస్తున్నది. జీవుడు అహము యొక్క భావమును గ్రహించినవాడై, అనగా అహంభావుడై ఈ పనిని నేనే చేయుచున్నానని భావిస్తున్నాడు. అప్పుడు కార్యములో స్వభావముగా పుట్టిన ఆగామికర్మ జీవుని కర్మచక్రములో చేరిపోవుచున్నది. జీవాత్మ పాత ప్రారబ్ధకర్మను అనుభవించినవాడైనప్పటికీ క్రొత్త ఆగామికర్మ తిరిగి సంపాదించుకొన్న వాడైనాడు. అనుభవించి పాతకర్మను లేకుండా చేసుకొనగా తిరిగి క్రొత్త కర్మ వచ్చి చేరినది. ఇది సాధారణ జీవుని యొక్క నిత్య కర్మ విధానము, నిత్య కార్యాచరణలో పుట్టుకొస్తున్న నిత్య కర్మాభివృద్ధి. ఈ విధానము సర్వజగత్తులో జీవుల ఎడల జరుగు యాంత్రిక విధానము. ఇది అంతర్ముఖముగా జరుగుచున్నది. కావున ఎవరికీ తెలియక పోయినది. బాహ్యకార్యముల మీద ఉన్న దృష్టి అంతరంగ విధానము మీద ఏమాత్రము ఎవరికీ లేదు. అందువలన కర్మ తరగడమే గాక పెరుగుచూ పోవుచున్నది. కర్మవున్నంత వరకు జన్మలు తప్పవు. కావున జీవుడు జనన మరణ చక్రము నుండి బయటపడలేక పోవుచున్నాడు.

కర్మ ఎలా వస్తున్నదో తెలుసుకొన్నాము. కర్మ ఎలా రాకుండా చేసుకోవాలో కూడా తెలుసుకొందాము. ఇంతవరకు శ్లోకము యొక్క నిజార్థములోనికి మనము రాలేదు. ఇప్పుడు శ్లోకములో చెప్పబడిన విషయములోనికి వస్తున్నాము. ప్రారబ్ధము ప్రకారము కార్యములు ఎలా జరుగుచున్నవో, శరీరములోనున్న మనో, బుద్ధి, చిత్త, అహంకారముల యొక్క పనియేమో, ఏమీ చేయని జీవుడు ఎందుకున్నాడో తెలుసుకొన్నాము.

చివరిలోనున్న అహము కార్యమునకు కారణము నేను అను భావము జీవునకు పుట్టించుట చేత క్రొత్త కర్మను తగిలిస్తున్నదని తెలుసుకొన్నాము. కర్మ అంటుకొనుటకు కారణము అహమేనని తెలిసిపోయినది. కర్మను తగిలించడమే అహము యొక్క పనియైనప్పుడు, కర్మ నిర్మూలనము కూడా అహము వద్దనే ఉన్నదని తెలిసిపోవుచున్నది. అహము యొక్క మాటను జీవుడు గ్రుడ్డిగా వినడము వలననే కర్మ అంటుచున్నది. కావున జీవునకు అహమునకు ఉన్న సంబంధములోనే కర్మ అంటు సారాంశమున్నది. వాస్తవానికి కార్యములో జీవునకు సంబంధము లేనప్పుడు నేనే చేయుచున్నానని జీవుడు అనుకోవడము, అహము యొక్క మాటను నిజమా కాదా అని చూడక జీవుడు గ్రుడ్డిగా నమ్మడము ఎందుకు జరుగుచున్నదని యోచించి చూచిన, జీవునకు సత్యమేది? అసత్యమేదని తెలుసుకొను విచక్షణా దృష్టిలేదని తెలియుచున్నది. అజ్ఞాన అంధత్వముతోనున్న జీవుడు ప్రక్కన ఉన్న అహము మీద ఆధారపడుచున్నాడు. అహము యొక్క పని ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు చెప్పడమే కావున, జీవునకు సంబంధములేని విషయమును సంబంధమేర్పరచి అహము చెప్పుచున్నది. అజ్ఞానమను గ్రుడ్డితనము గల జీవుడు అహముమీద ఆధారపడి అది చెప్పినది నిజమేనని నమ్ముచున్నాడు.

జ్ఞానదృష్టి కల్గిన జీవుడు అహము మీద ఆధారపడడము లేదు. కార్యమునకు కారణమూలము కర్మని, దాని ప్రేరణలో మనస్సు, బుద్ధి, చిత్తము, గుణములను ఉపయోగించుకొని కార్యము చేయుచున్నవని, జీవుడైన తనకు కార్యములోని అనుభవము తప్ప ఇతరత్రా సంబంధమేమీ లేదని తన జ్ఞానదృష్టితో తెలుసుకొనుచున్నాడు. అటువంటప్పుడు అహము యొక్క మాటను అసత్యమని త్రోసివేయుచున్నాడు. బాహ్యముగా అగ్ని మండుటకు ఆక్సిజన్ (ప్రాణవాయువు) అవసరము. అట్లే అగ్ని

ఆరిపోవుటకు కార్బన్ డై ఆక్సైడ్ (బొగ్గుపులుసు వాయువు) అవసరము. ఆక్సిజన్ ఉన్నప్పుడే మంట మండగల్గుచున్నది. ఆ విధముగానే అహము పని చేయకున్నప్పుడే జ్ఞానాగ్ని మంట ప్రకాశముగా మండుచున్నది. కార్బన్ డై ఆక్సైడ్ ఉన్నప్పుడు అగ్ని ఆరిపోవునట్లు అహము యొక్క పని ఉన్నప్పుడు జ్ఞానాగ్ని మండక ఆరిపోవుచున్నది. బాహ్యాగ్ని మండుటకు, ఆరిపోవుటకు వాయువు యొక్క ఆక్సిజన్, కార్బన్ డై ఆక్సైడ్‌లు కారణమైనట్లు. శరీరములో జ్ఞానాగ్ని మండుటకు ఆరిపోవుటకు అహము యొక్క వృత్తి నివృత్తులు కారణమగుచున్నవి. అహము వృత్తిగా ఉన్నప్పుడు జ్ఞానాగ్ని ఆరిపోయి కర్మలను కాల్చలేని స్థితిలోనున్నది. అప్పుడు సంభవించు ఆగామికర్మ జీవుని కర్మచక్రమును చేరుచున్నది. అహము నివృత్తి అయినప్పుడు జ్ఞానాగ్ని ప్రజ్వరిల్లి మండుచూ కర్మను కాల్చు స్థోమత కల్గియున్నది. అప్పుడు సంభవించు ఆగామికర్మ జ్ఞానాగ్నిలో పూర్తి కాలిపోవుచున్నది. ఆగామికర్మ దహనమగుటకు మరియు కాకుండుటకు అహంకారవృత్తి నివృత్తుల మీద ఆధారపడివున్నది.

అహంకారము శరీరములో ఒక్కమారు కొంత సమయము లేకుండా పోయిన తర్వాత ఎప్పటికీ లేకుండా పోతుందనుకోకూడదు. జీవునకు ఒకమారు మరణమొచ్చినంత మాత్రమున వేరేచోట పుట్టదని చెప్పలేము కదా! అట్లే అహము కూడ ఒక విషయములో నివృత్తి అయినంతమాత్రమున వేరే విషయములో పుట్టదనుకోకూడదు. శరీరము ఉన్నంతవరకు అది ఉండును. అది మాటిమాటికి తన పని తాను చేయుచుండును. జ్ఞానము కల్గిన జీవుడు కూడా మాటిమాటికి దాని మాటను పెడచెవిన పెట్టుచు అహమును నివృత్తి చేయుచూనే ఉండవలెను. ఎప్పుడైతే అహమున్నదో అప్పుడు జ్ఞానాగ్ని లేదు, ఆగామికర్మ కలదు. ఎప్పుడైతే అహము లేదో అప్పుడు జ్ఞానాగ్ని వున్నది, ఆగామికర్మలేదు. అహమునుబట్టి జ్ఞానాగ్ని,

జ్ఞానాగ్నిని బట్టి కర్మ కలదని తెలియాలి. అహంకారమున్నప్పుడు ఆగామికర్మ ఉన్నది. అహంకారము లేనప్పుడు ఆగామికర్మ లేదు. అహంకారము లేనప్పుడు జ్ఞానాగ్ని ఉన్నది. అహంకారము ఉన్నప్పుడు జ్ఞానాగ్ని లేదు. జ్ఞానాగ్ని ఉన్నప్పుడు ఆగామిక కర్మ కాలిపోవుచున్నది. జ్ఞానాగ్ని లేనప్పుడు ఆగామికర్మ వృద్ధి అగుచున్నది.

జ్ఞానము కల్గినవాడు, శరీర యంత్రాంగమంతా తెలిసినవాడు, పని చేయునప్పుడు ప్రారబ్ధకర్మ ప్రకారము పని జరుగునని తెలిసినవాడై, ప్రారబ్ధకర్మ ప్రకారమే కనిపించు ఫలితము వచ్చునని తెలిసి చేయుచుండును. ఫలితము మీద ఆశ పెట్టుకొనక దానిని ప్రారబ్ధము ముందే నిర్ణయించి వుండునని, తన ఇష్ట అయిష్టముల మీద ఫలితముండదని తెలిసి చేయు చుండును, ఈ విధముగా ఫలితము మీద ఆశలేక అంతటికి ప్రారబ్ధ కర్మే కారణమని, దానిప్రకారమే శరీర భాగములన్నియు పని చేయుచున్నవని, శరీరములో తానొక భాగమని, తన పని కష్టసుఖములు అనుభవించడమే నని తెలిసివుండును. అట్లు తెలిసి నిమిత్తమాత్రముగా కార్యములు చేయువానిని కర్మయోగి అంటున్నాము. వానిలో జ్ఞానాగ్ని వుండి ఆగామికర్మ రాకుండా కాల్చి బూడిద చేయుచున్నది. కర్మల బూడిద కల్గినవాడు కనుక సన్న్యాసి అంటున్నాము. సన్న్యాసి దగ్గర బూడిద తప్ప ఏముంటుందని మాట వరుసకు అంటుంటాము కదా! సన్న్యాసి అంటే కర్మయోగియనీ, బూడిద అంటే కర్మ కాలినదని ఎవరూ అనుకోరు. బయటికి కనిపించు బూడిద లేకున్నప్పటికీ వాని దగ్గర బూడిద తప్ప ఏముంది అనడము విచిత్రమే కదా!

దీనికంటే మరొక పెద్ద విచిత్రమేమిటంటే **"నని రగ్ని, అగ్నిలేని వాడు"** అని పై శ్లోకములో చెప్పగా, బాహ్యముగా ఉన్న అగ్నితో

యజ్ఞయాగాదులు చేయనివాడు అని అర్థము చెప్పడము మరీ విచిత్రము కాదా! జ్ఞానాగ్నికి ఎంతో చరిత్ర ఉండగా దానిని మచ్చుకైనా వివరించక, బాహ్య అగ్నిని పోల్చి చెప్పడము ఏమాత్రము సమంజసమైన పనో మీరే యోచించండి. కర్మ ఫలము మీద ఆశ లేక కార్యములు చేయువాడు నిజమైన సన్యాసి, నిజమైన యోగి అని శ్లోకములో చెప్పబడియున్నది. దీనికర్థము శరీర యంత్రాంగమంతయు తెలిసి, సర్వకార్యములకు ప్రారబ్ధము కారణమని, ఫలితము కూడా దాని నిర్ణయమేనని తెలిసినవాడు, నిజమైన యోగి అని తెలియాలి. అట్లే అగ్ని లేనటువంటి వాడు, పనులు మానుకొన్నవాడు సన్యాసి కాదు, యోగికాదు అనుటలో అర్థము జ్ఞానాగ్ని లేనివాడని, పనులు చేయుట వలన కర్మ వస్తుందని భయపడి పనులు చేయనివాడని అర్థము. పై శ్లోకములో **"ఫలితము మీద ఆశ పెట్టుకోక కార్యములు చేయవలెనని తలచి చేయువాడు నిజమైన సన్యాసి నిజమైన యోగి. అగ్ని లేనటువంటి వాడు, పనులు చేయనివాడు సన్యాసి కాడు, యోగికాడు"** అను విషయము వ్రాయబడిన వివరములో పూర్తి అర్థమైందను కొంటాము.

ఈ శ్లోకములోని భావములో ఎక్కడయినా గడ్డమును గురించి చెప్పారా? దీనిని చదివిన తర్వాత సన్యాసత్వము అంటే పూర్తి కర్మయోగము అని అర్థమగుచున్నది. ముఖ్యముగా పనులు మానుకొన్నవాడుగానీ, జ్ఞానాగ్ని లేనివాడుగానీ సన్యాసి కాడు అని చెప్పారు. **"నని రగ్ని నచాక్రియః"** అను మాటను మరచిపోయి నేడు గల సన్యాసులు కాషాయ గుడ్డలకు గడ్డము, జుట్టు పెంచుటకు అలవాటు పడిపోయి **"తాను చెడిన కోతి వనమెల్ల చెరిసె"** అన్నట్లు తాను సన్యాసి కాకపోగా మిగతా వారిని కూడా అలాగే ఉండవలెనని చెప్పుచున్నారు. ముస్లీమ్‌ల గడ్డముల గురించి

అంతిమ దైవగ్రంథమైన ఖుర్ఆన్‌లో ఏ విధముగా లేదో అదే విధముగా ప్రథమ దైవగ్రంథములో హిందువుల గడ్డములను గురించి కూడా దేవుడు ఏమీ చెప్పలేదు. తాను సన్యాసియని తెలియుటకు బయట గుర్తులు ఏమీ ఉండవు. అయితే నేడు సన్యాసులను సులభముగా గుర్తు పట్టుటకు ధరించిన కాషాయ గుడ్డలు, పెంచిన గడ్డములు బాగా కనిపిస్తున్నవి. దేవుడు చెప్పిన విధానమును వదలి దేవుడు చెప్పని విధానమును ఆచరించువాడు తాము చేయుచున్నది తప్పని కొద్దిగా కూడా సంకోచించక ఇతరులను కూడా నీవు నావలె ఎందుకులేవు? అని ప్రశ్నించుచూ, సరియైన సన్యాసిని చూచి నీవు సన్యాసివే కాదంటున్నారు. ఈ విధముగా సన్యాసులయిన వారికి సన్యాసత్వమును గురించి తెలియకుండా పోయినది. అట్లే మహర్షులకు కూడా తమ హోదాలను గురించి తమకే తెలియకుండా పోయినది.

మనుషులలో దైవశక్తి యున్నవారిని అనగా జ్ఞానాగ్నియున్న వారిని, వారిలోని అగ్నిని బట్టి అగ్నియొక్క సాంధ్రతను, నిలువనుబట్టి ఆ మనిషికి యోగ్యతా పేర్లుండును. కొంత జ్ఞానశక్తియున్న వానిని మహర్షి అని చెప్పడము జరుగుచుండును. 25 పైసల జ్ఞానాగ్నియున్న వానికి **మహర్షి** యని పేరురాగా, 50 పైసలంత జ్ఞానాగ్ని గలవానిని **రాజర్షి** అని చెప్పడము జరుగుచున్నది. 75 పైసలంత జ్ఞానాగ్నియున్న వానిని **దేవర్షి**యని చెప్పవచ్చును. 100 పైసలంత జ్ఞానాగ్ని (జ్ఞానశక్తి) యున్నవానిని **బ్రహ్మర్షి** యని చెప్పవచ్చును. ఏమాత్రము జ్ఞానశక్తి లేక జ్ఞానాగ్ని లేని మనిషిని బేవర్షి అని చెప్పవచ్చును. నేటి కాలములో భూమిమీదయున్న మనుషులలో మహర్షులు అరుదుగాయుందురు. మిగతావారందరూ బేవర్షులుగానే యుందురు. మహర్షిని మించిన హోదా రాజర్షి. ఇప్పుడు రమణానంద

స్వామివారు తనను ఒకమారు మహర్షినని చెప్పడము, మరియొకమారు రాజర్షినని చెప్పడము చూస్తే ఆయన మహర్షియా లేక రాజర్షియా అను సందిగ్ధములో పడవలసి వచ్చుచున్నది. నేడు భూమిమీద చాలావరకు జ్ఞానాగ్నిని గురించిన హోదాలు బహుశా తెలియవనియే చెప్పవలెను. సామాన్య ప్రజలు బేవర్షులయినా ఫరవాలేదు. సన్న్యాసులయిన వారు కనీసము **మహర్షి** హోదాలో అయినా ఉండవలెనని కోరుచున్నాము. ఇంకా ముందుకు పోయి జ్ఞానశక్తిని ఎక్కువ సంపాదించి **రాజర్షి, దేవర్షి, బ్రహ్మర్షి** హోదాలను సంపాదించుకుంటామంటే మాకు మరీ సంతోషము.

సాయిబాబాను నేడు ఎందరో దైవముతో సమానముగా భావించి ఆరాధించడము జరుగుచున్నది. అలా ప్రజలు ఆరాధించడము వలన ఎవరికీ ఏ నష్టము లేదు. మాకు రావలసిన ఆదాయమును ఇతరులకు అనగా సాయిబాబాకు పోతున్నదను అసూయ భావముతోనూ, తమకు రావలసిన గౌరవమును ప్రజలు సాయిబాబాకు ఇస్తున్నారను ద్వేష భావము తోనూ కర్ణాటకనుండి విశాఖపట్టణము వరకు వచ్చి గోవిందానంద రమణానందతో వాదించడము జరుగుచున్నది. వాదనతో ఎవరినీ మార్చలేము. ఎవరి బుద్ధి వాదనతో మారదు. ఇతరుల బుద్ధిని మార్చవలె నంటే, వారిది చెడు దారియైతే దానిని కాదని మంచి దారిలోనికి మళ్ళించు టకు వాదనలు పనికిరావు. వాదనల వలన అసూయలు పెరుగును. తప్ప లాభము ఏమీ ఉండదు. ఎటువంటి చెడు మార్గమునయినా మాన్పించుటకు జ్ఞానమును వివరముగా చెప్పి మాన్పించవచ్చును. జ్ఞానముతోనే దేనినయినా పరిష్కారము చేయవచ్చును.

**ప్రశ్న :- (గోవిందానంద) మీకు గురు పరంపర లేదు. మీరు సనాతన ధర్మమును అంగీకరించడము లేదు. మీరు సనాతన ధర్మమును ఆచరించడము లేదు.**

**నా జవాబు :-** సనాతన ధర్మము అనుమాటను నేను అనేకమార్లు అనేకమంది స్వామీజీలు అంటుండగా విన్నాను. నేను కొంత జ్ఞానమును తెలిసిన వాడినే అయినా చాలామంది స్వామీజీలు చెప్పు సనాతన ధర్మము అంటే ఏమిటో నాకు ఏమాత్రము అవగాహనకు రాలేదు. నూరు శాతము ప్రజలలో 95 శాతము జ్ఞానమంటే ఏమిటో, దేవుడంటే ఏమిటో తెలియని వారే గలరు. మిగతా ఐదు శాతము మనుషులలో జ్ఞానము మీద ఆసక్తి కల్గియుండగా వారిలో వేయింటికి ఒకడు అరుదుగా స్వామీజీలుగా మారియున్నారు. అలామారిన వారిలో కొందరు సన్యాసులుగా ఉండగా, కొందరు గురువులుగా, స్వామీజీలుగా వ్యవహరిస్తున్నారు. వీరిలో చాలామంది సనాతన ధర్మమును ఆచరించాలి అను వారు కొందరున్నారు. మనది సనాతన ధర్మము అని చెప్పువారు కొందరున్నారు. వారందరూ సనాతన ధర్మమును ఆచరించువారిగానే చెప్పుకొనుచుందురు. అటువంటి వారు కొన్ని సభలలో హిందుత్వమును గొప్పగా చెప్పుచూ హిందువులది సనాతన ధర్మమని చెప్పుచుందురు. ఇట్లు అనేక సందర్భములలో సనాతన ధర్మము అనుమాటను చాలామంది స్వామీజీల మాటలలో విన్నాను. ఇంతమంది సనాతన ధర్మమును చెప్పుచుండగా, వారు ఆచరించు అదేదో నాకు మాత్రము అర్థము కాలేదు.

నాకున్న జ్ఞానము ప్రకారము నేను యోచించగా అలా చెప్పు స్వామీజీలకందరికీ సనాతన ధర్మమటుంచి, ఉత్త ధర్మము కూడా వారికి తెలియదని అర్థమయినది. వారు చెప్పు మాటల దాంభికమైనవేగానీ వారికి సనాతన ధర్మమేదో తెలియదనియే చెప్పవచ్చును. సనాతన అనగా ముందు కాలమునుండి వచ్చునదని అర్థము లేక పూర్వము చెప్పబడినదని అర్థము. పూర్వము సృష్ట్యాదిలో దేవుడు తన ఆకాశ భూతము ద్వారా మొట్టమొదట

చెప్పినదే మొదటి జ్ఞానము. దానినే సనాతన ధర్మము అని చెప్పవచ్చును. ఆకాశము చెప్పిన జ్ఞానము మనుషులకు అర్థము కాలేదని, దేవుడే మనిషి రూపముగా వచ్చి పూర్వము ఆకాశవాణి ద్వారా చెప్పిన జ్ఞానమును విపులముగా అందరికీ అర్థమయ్యేలాగున చెప్పిపోయాడు. ద్వారప యుగమున కృష్ణ భగవానుడు భగవద్గీత రూపములో చెప్పిన జ్ఞానము సనాతన ధర్మముతో కూడుకొన్నదేయని తెలియుచున్నది. అయితే భగవంతునిగా వచ్చిన దేవుడు సనాతన ధర్మమును గురించి భగవద్గీత రూపములో చెప్పిన జ్ఞానము ఇప్పటికి దాదాపు ఐదువేల సంవత్సరములకు పైగా అయినది. అయినా అందులో చెప్పిన ధర్మములు ఏవో, అధర్మములు ఏవో తెలియని స్థితిలో స్వాములు సహితమున్నారంటే ఆశ్చర్యపడనవసరము లేదు. భగవద్గీతలో భగవంతుడు చెప్పిన జ్ఞానము సన్న్యాసులుగా యున్న వారికీ, స్వాములుగా చలామణి అగువారికే అర్థము కాలేదంటే సాధారణ మనుషులకు అర్థమయినదని చెప్పుటకు వీలులేదు.

నేడు ఉపన్యాస వేదికల మీద 'సనాతన ధర్మము' అను గొంతు చించుకొని అరచు వారికి భగవద్గీతలోని ఒక్క ధర్మముగానీ అర్థము కాలేదు. అట్లే ఒక్క అధర్మముగానీ అర్థము కాలేదు. ఈ నా మాటలు వినేవారు కొందరు అందరికీ అర్థము కాలేదని మీరెలా చెప్పగలుగుచున్నారు? ఏ ఆధారముతో చెప్పగలుచున్నారని అడుగువచ్చును. దానికి నా జవాబు ఏమనగా! భగవద్గీతలో చెప్పిన ధర్మములను ఎవరూ ఆచరించకపోగా, అదే భగవద్గీతలో ఇవి అధర్మములన్నట్లు వీటివలన దేవుడు తెలియబడడని చెప్పినప్పటికీ, ఆ మాటను లెక్కచేయక ఏ పనులైతే దేవునిపట్ల సరిపోవని చెప్పారో వాటినే స్వామీజీలు, గురువులను వారు అందరూ ఆచరిస్తున్నారు. ఏ క్రియల వలన దేవుడు తెలియబడడని చెప్పాడో అదే క్రియలనే

ప్రాముఖ్యముగా ఆచరించుచున్నారు. దీనినిబట్టి వీరందరికీ భగవద్గీత అర్థము కాలేదనియే నిరూపణగా తెలియుచున్నది.

సృష్ట్యాదిలో చెప్పబడిన జ్ఞానమును లేక ధర్మములను ఆచరించడము వలన సనాతన ధర్మములను ఆచరించినట్లగునుగానీ, మొదట చెప్పిన జ్ఞానమును ఆచరించనివారు సనాతన ధర్మమును ఎట్లు ఆచరించిన వారగుదురు? సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానము ఒకే ఒక భగవద్గీతా జ్ఞానమని అందరికీ తెలుసు. ఆ భగవద్గీతలో చెప్పిన ధర్మములే సనాతన ధర్మములు అయితే వాటిని ఆచరించిన వారు సనాతన ధర్మములను ఆచరించినట్లగును. ఇంతవరకు తమ మాటలలో సనాతన ధర్మములని ఏదో హక్కుగా చెప్పు వారందరికీ ఆ సనాతనమైన ధర్మములేవో కనీసము ఒక్కటి కూడా తెలియదనియే చెప్పవచ్చును. బికారియైన వాడు తాను కోటీశ్వరుడనని చెప్పుకొన్నట్లు, తనకు సనాతనమైన ధర్మముల ఉనికి కూడా తెలియనివారు సనాతన ధర్మములను అందరూ ఆచరించమని చెప్పుచున్నారు. నేను కొందరిని సనాతన ధర్మమంటే ఏమిటియని ప్రశ్నించాను దానికి చాలామంది చాలా రకముల జవాబులు చెప్పారు. నిత్యము క్రమము తప్పక ధ్యానము చేయడము సనాతన ధర్మమని కొందరు చెప్పగా, కొందరు యజ్ఞయాగాదులు చేయడము సనాతన ధర్మము అన్నారు. కొందరయితే దేవతలందరినీ ఆరాధించడము సనాతన ధర్మమనగా, కొందరు దానములు చేయడము సనాతన ధర్మమని అంటున్నారు. అవి ఏవీ సనాతన ధర్మములు కావు.

**ప్రశ్న :- (గోవిందానంద) సాయిబాబాను దేవుడని పూజిస్తున్నారు కదా! భగవంతునికి ఆరు లక్షణములుంటాయి. ఆ ఆరు లక్షణములు సాయిబాబాకు ఉన్నాయా? ఆరు లక్షణములు లేనివాడు భగవంతుడెట్లగును?**

**నా జవాబు :-** గోవిందానంద గారు సాయిభక్తులయిన రమణానందగారిని తన ప్రశ్నలతో అదరగొట్టాలని ఈ విధమైన ప్రశ్నలు వేయుచున్నారు. నామ, రూప, క్రియలు లేనివాడు దేవుడని ముందే చెప్పాము. అందువలన దేవుడు ఫలానావాడని చెప్పుటకు వీలులేదు. దేవుడే భగవంతునిగా వచ్చుట వలన భగవంతున్ని కూడా కనుగొనుటకు వీలు లేనట్లుండును. భగవంతునిగా వచ్చిన వానినే 'గురువు' అని అనవలసి వచ్చును. దేవుడు మనిషిగా వచ్చి జ్ఞానమును చెప్పుట వలన భగవంతున్నే గురువు అంటున్నాము. అయితే గుర్తింపబడని వాడు గురువు. గురువును భూమిమీద ఎవరూ గుర్తించలేరు. అందువలన **"గుకారస్య గుణాతీతః, రుకారో రూపవర్జితమ్"** అని గురు అను రెండక్షరములకు వివరమును చెప్పారు. ఫలానా రూపములో ఉన్నాడని తెలియనివాడు, ఫలానా గుణములో ఉన్నాడని చెప్పుటకు వీలుకాని గుణాతీతుడు గురువని పూర్వము పెద్దలు వ్రాసియుంచారు. అందువలన దేవుడు దేవునిగా యున్నప్పుడుగానీ, రూపముతో భగవంతునిగా ఉన్నప్పుడు గానీ ఆయనను ఎవరూ గుర్తించలేరని చెప్పవచ్చును.

అయితే కొందరు అజ్ఞానము చేత దేవునియొక్క ధర్మము తెలియని వారై, దేవుడే భగవంతునిగా ఉంటాడని తెలియనివారై, దేవునివలె భగవంతుడు కూడా తెలియనివాడుగా ఉండునని తెలియనివారై, భగవంతునికి భగవద్గుణ షట్కము అను ఆరు గుణములను చెప్పారు. గుణషట్కము అనినా అవి గుణములు కాదుగానీ, బాహ్యసంపదలని చెప్పవచ్చును. భగవంతునికి ఈ ఆరు బాహ్య సంపదలున్నట్లు చెప్పుచున్నారు. అవి వరుసగా ఇలా గలవు. 1) ఐశ్వర్యము 2) వీర్యము 3) యశము (కీర్తి) 4) శ్రీ 5) జ్ఞానము 6) వైరాగ్యము. ఈ ఆరు కల్గినవాడు భగవంతుడని గుడ్డిగా చెప్పేశారు.

అయితే ఈ ఆరు భూమిమీద చాలామందికి ఉన్నాయి. అటువంటప్పుడు అటువంటి వారందరినీ భగవంతులని అనవచ్చునా? అట్లు అంటే భగవంతుడు గుర్తింపబడేవాడు అని చెప్పవచ్చును. ఒకప్పుడు భారతములో చెప్పబడిన కర్ణునికి కూడా ఈ ఆరు ఉండేవి. అంతమాత్రమున కర్ణున్ని మనము భగవంతుడని అనలేదే! భగవంతునికి ఈ ఆరు ఉండునని చెప్పడము ప్రపంచ సంబంధముగా అన్యాయమగును. దైవసంబంధముగా అధర్మమగును. సన్యాసులుగానీ, స్వాములుగానీ ఈ మాట మాట్లాడడము పూర్తి తప్పగును.

**ప్రశ్న :- (TV9 వాళ్ళు) సాయిబాబాను దేవుడు అని అనాలా? అనకూడదా? చివరిగా చెప్పండి.**

**నా జవాబు :-** సాయిబాబాగారు ఒక మనిషి. ఆయన తన మహత్యముల వలన ప్రజలలో గొప్పగా గుర్తింపు పొందాడు. అందువలన ఆయనను మన భక్తి కొలది దేవునితో సమానముగా ఆరాధించినా ఫరవాలేదుగానీ ధర్మబద్ధముగా ఆయనను దేవుడు అని అనకూడదు. బ్రహ్మ విద్యా శాస్త్రమయిన భగవద్గీత ప్రకారము బ్రతికియున్న మనిషి దేవున్ని గుర్తించలేడు. అలాగే భగవంతుడు గుర్తింపబడడు. భగవంతుడు భూమిమీదకు వచ్చి పోయిన తర్వాత ఆయన చెప్పిన ధర్మములనుబట్టి ఫలానావాడు భగవంతుడని చెప్పవచ్చునుగానీ అతను బ్రతికియున్నపుడు ఎవరూ ఆయనను గుర్తించలేరు. వాస్తవానికి కృష్ణుడు వచ్చి పోయిన తర్వాత మాలాంటి వారికి ఆయన భగవంతుడు అని తెలిసినది. అయితే మిగతా వారు ఈనాటికి ఆయనను భగవంతుడనక జారుడు, చోరుడు అని అంటున్నారు. సాయిబాబా గారి విషయమునకు వస్తే ఆయన ఎక్కడగానీ, ఎవరితోగానీ దైవ సంబంధ జ్ఞానము చెప్పినదిగానీ, దైవధర్మములను తెలిపినదిగానీ లేదు.

ఆయన వరకు ఆయన గొప్ప సాధనలు చేశాడు. ఎన్నో సంవత్సరములు తపస్సు చేశాడు, తపశ్శక్తిని సంపాదించుకొన్నాడు. దానిని మోక్షమునకు ఉపయోగపడునట్లు చేసుకోక ప్రజలతో మహత్యములకు వినియోగించు కొని ప్రజలకు మేలు చేశాడు. దానివలన ఆయనకు విశేషమైన పుణ్యము వచ్చియుంటుంది. అంతేగానీ దైవికమయిన బోధలు చెప్పినట్లు ఎక్కడా ఆయన జీవిత చరిత్రలో లేదు. ఆయనకు తెలిసిన దానిప్రకారము అందరి దేవుడు ఒక్కడేయని చెప్పెడివాడు. ఆయన కూడా దేవున్ని గురించి తెలుసు కొను మార్గములో ఉన్నాడుగానీ, ఆయన దేవుడు కాదని చెప్పవచ్చును. ఆయన దేవుడా! కాదా? యని ఎవరికి వారు తెలుసుకొను విషయమేగానీ, దానిని గురించి పోట్లాడుకొను విషయము కాదు. ఎవరి నమ్మకము ప్రకారము వారు నడుచుచుందురు. వారి నమ్మకములకు అడ్డు తగులు ప్రయత్నము చేయకూడదు. ఒకవేళ వారిని మంచిమార్గములో నడుపుటకు అవసరమైన దైవజ్ఞానమును చెప్పుట చేత వారే ఎవరు దేవుడు, ఎవరు దేవుడుకాదని తెలియగలరు. అట్లు కాకుండా అసూయతో ఎదుటి వాడు చెప్పే మాటలు కూడా వినకుండా అడ్డుతగిలి మాట్లాడడము తన వాదన గొప్పదనుటకే గానీ, ఉన్న సత్యమును చెప్పుటకు కాదని తెలిసిపోయినది. సాయిబాబా దేవుడా! కాదా?యను చర్చావేదికలో ఫోన్‌లలో టీవీ9 వారి ద్వారా గోవిందానందకు అందరూ అద్వైతమునకు సంబంధించిన వారే మద్దతు తెలుపడము, రమణానంద మీదికి ఎదురు దాడి చేయడము చూస్తే ఒక్క అద్వైతులు తప్ప ఇతరులు ఉండకూడదనేది వారి ఉద్దేశ్యము. విశిష్టాద్వైత పీఠమునకు సంబంధించిన వారుగానీ, ద్వైత పీఠమునకు సంబంధించిన వారుగానీ ఎవరూ ఈ చర్చలో ఎటూ మాట్లాడలేదు. ఒక్క అద్వైతులు, జ్ఞానులు, స్వాములు అందరూ మాట్లాడడము జరిగినది.

మాట్లాడినవారు సామ రస్యమును కలిగించుటకు మాట్లాడలేదు. సాయిని దేవుడు కాదని చెప్పడమే వారి ఉద్దేశ్యమై ఉన్నది. చివరిగా అందరికీ నేను చెప్పునది ఏమనగా! ఏదయినా బ్రాహ్మవిద్యా శాస్త్రము ప్రకారము అనగా దైవ జ్ఞానము ప్రకారము వివరించి ఖండించవచ్చును. అట్లు కాకుండా శాస్త్రము ఒప్పుకోదు, శాస్త్రము ఇలా చెప్పింది, శాస్త్రము అలా చెప్పలేదు అని మాట్లాడకూడదు. ఏ శాస్త్రము చెప్పినదో ఎక్కడ చెప్పినదో వివరముగా చెప్పకుండా ప్రతి దానికి శాస్త్రము అనుమాటను అడ్డు పెట్టకూడదు. దైవమునకు సంబంధించినది బ్రహ్మవిద్యా శాస్త్రము ఒక్కటే గలదు. అదే భగవద్గీత. భగవద్గీతలో భగవంతుడు చెప్పిన విషయముంటే చెప్పవలెనుగానీ, అట్లు చెప్పకుండా శాస్త్రము ఒప్పుకోదు అనేవారంతా శాస్త్రము పేరు చెప్పి మోసము చేయు వారుగా పరిగణించబడుదురు. భగవద్గీతను గురించి ఇంతవరకు సరిగా తెలియనివారు కూడా శాస్త్రము అని పేరుపెట్టి మాట్లాడడము, జ్ఞానులుగా చలామణి కావడము జరుగుచున్నది. ఇప్పుడు సమస్య చర్చగా వచ్చింది కావున మేము భగవద్గీత ప్రకారము సాయిబాబా గారు దేవుడు కాదు, భగవంతుడు కాడని చెప్పుచున్నాము. దేవుడు దేవులాడబడేవాడే (వెతకబడే వాడే) గానీ దొరుకువాడు కాదు. **దేవుడు రూప, నామ, క్రియా రహితుడు** కావున ఆయనను ఎవరూ గుర్తించలేరు. దేవుడు మనిషిగా వచ్చి తన జ్ఞానమును చెప్పవలసియున్నది. అప్పుడు భగవంతునిగా వచ్చినా ఎవరికీ తెలియబడడు. తెలియుటకు ఎవరికీ చేతకాదు. అందువలన సాయిబాబా దేవుడయినా ఆయనను ఫలానాయని ఎవరూ చెప్పుటకు వీలులేదు. అనుమానము లేకుండా సత్యమును చెప్పితే సాయిబాబాగారిని మహాత్ముడని చెప్పవచ్చును, దేవుడని చెప్పకూడదు.

**ప్రశ్న :- ఇంతవరకు "స్వాముల లడాయి" అను చర్చావేదికలో 'సాయిబాబా దేవుడా! కాదా?'యను విషయము మీద ఎక్కువగా గోవిందానంద అడిగిన ప్రశ్నలకు మీరు అక్కడ లేకున్నా మూడవ వ్యక్తిగా ఇక్కడ జవాబు ఇచ్చారు. ఇప్పుడు నేను మిమ్ములను నేరుగా ఒక ప్రశ్న అడుగుచున్నాను. ఈ విషయములో మీరెందుకు తలదూర్చి సమాధానము గ్రంథరూపముగా చెప్పారు?**

**జవాబు :-** గోవిందానంద గారు హిందూమతములో సిద్ధాంతములు మూడు ఉన్నవి అన్నప్పుడు, నాల్గవదయిన త్రైత సిద్ధాంతమును ప్రతిపాదించిన నేను బ్రతికేయుండగా హిందూమతములో నాల్గవ సిద్ధాంతము కూడా యున్నదని, దాని వయస్సు ఇప్పటికి 38 సంవత్సరములని తెలుపుచూ అది ఎంత జ్ఞాన సామత్యము కలదో వారు తెలియుటకు నేను జవాబు లివ్వడము జరిగినది.

**ప్రశ్న :- సాయిబాబాగారి గురించి శిరిడికంటే పూర్వజీవితమును పెనుకొండలో గడిపినట్లు మీరు తెలియజేశారు. అది ప్రజలకు క్రొత్త విషయమేనని అనుకొంటున్నాను. సాయిబాబాగారు ఒక దినము పెళ్ళి గుంపులో కలిసి శిరిడికి వచ్చినట్లు, అప్పటినుండి శిరిడిలో నిలిచిపోయి ప్రజల మధ్యలో ఉండినట్లు చరిత్ర గలదు. అంతకంటే సాయిబాబాను గురించి ప్రజలకు తెలియదు. అయితే మీరు సాయిబాబా గారు శిరిడికంటే ముందు పెనుకొండ కోట ప్రాంతములో గల గుహలో చాలా సంవత్సరములు తపస్సు చేస్తూయున్నట్లు తెలియజేశారు. అదే విధముగా సాయిబాబా శిరిడిలో కనిపించుటకంటే ముందు, పెనుకొండ వదలిపోయిన తర్వాత ఇంకా ఎక్కడయినా కాలము గడిపాడా? అలా శిరిడి చేరకముందు ఎక్కడయినా యుంటే ఆయన ఎవరితో కలిసియుండెడివాడు? లేక**

**పెనుకొండ ప్రాంతమును వదలిన తర్వాత నేరుగా శిరిడి చేరిపోయాడా? మాలో యున్న ఈ ప్రశ్నలకు మీరు మీకు తెలిసిన దానిని తెలుపమని కోరుచున్నాము.**

**జవాబు :-** నాకు తెలిసినంతవరకు సాయిబాబాగారు పెనుగొండ వదలిన తర్వాత నేరుగా శిరిడి గ్రామమును చేరిన మాట వాస్తవమే గానీ, ఆయన అప్పుడు పెళ్ళి బృందములో కలిసి ఆ ఊరిలోనికి పోలేదు. ఆయన శిరిడి గ్రామము చేరిన తర్వాత కొన్ని సంవత్సరములకు శిరిడి ప్రజలకు కనిపించడము జరిగినది. అప్పుడే ఆయన పెళ్ళి బృందములో కలిసి ఆ ఊరిలోనికి పోయినట్లు అందరికీ తెలిసినది. అంతవరకు సాయిబాబాగారు శిరిడిలోనే ఉన్నట్లు ఎవరికీ తెలియదు. ఆయన ఎప్పుడు ఎట్లు శిరిడి చేరినది మాకు కూడా తెలియదు. అయితే అక్కడ జరిగిన కొన్ని సంఘటన లనుబట్టి సాయిబాబాగారు కొన్ని సంవత్సరములముందే ఆ గ్రామము (శిరిడి) చేరినట్లు తెలియుచున్నది. సాయిబాబా శిరిడి గ్రామములోనికి పెళ్ళి బృందములో కలిసిపోయినట్లు అందరికీ తెలుసు. అప్పుడు పెళ్ళివారివెంట వచ్చాడని, పెళ్ళి వారికి పరిచయస్థుడని అందరూ అనుకొన్నారు. అయితే సాయిబాబాను గురించి పెళ్ళి వారికి కూడా తెలియదు. ఆయన ఊరి బయట మార్గమధ్యలో కలిసి వారివెంట వచ్చినట్లు మాత్రమే వారికి కూడా తెలుసు. సాయిబాబాగారు శిరిడి చేరిన తర్వాత పెళ్ళివారితో సహా ఉండి పెళ్ళివారు పోయిన తర్వాత కూడా ఆయన ఎక్కడికి పోకుండా ఆ ఊరిలోనే నిలిచిపోయాడు. పీర్లచావిడిని తన నివాసముగా చేసుకొని ఉండెడివాడు. ప్రతి దినము ఊరిలో కొంత ఆహారమును అడుగుకొని కాలము గడిపెడి వాడు. ఒక దినము ఆయన ఊరి బయట కూర్చొనియుండగా ఒక వక్తి తన గుర్రము కనిపించలేదని మూడు రోజులుగా వెదుకుచూ అక్కడికి

రావడము జరిగినది. సాయిబాబాగారు గుఱ్ఱము కొరకు వెదకు మనిషిని చూచి తనవద్దకు పిలిచి "నీవు దేనికోసము వెదకుచున్నావు?" అని అడిగాడు. అప్పుడు గుఱ్ఱము కొరకు వెదకువాడు తాను తన గుఱ్ఱము కొరకు వెదకు చున్నానని చెప్పాడు.

ఆ మాట వినిన సాయిబాబాగారు నీ గుఱ్ఱము ఫలానా దిక్కున, ఫలానా దూరములో ఉంది అని చెప్పగా, ఆ మాట వినిన అతడు అక్కడికి పోయి చూడగా తన గుఱ్ఱము కనిపించినది. సాయిబాబాగారు తన గుఱ్ఱమును గురించి చెప్పాడని, ఆయన గొప్ప వ్యక్తి అని గుఱ్ఱము యజమాని శిరిడిలో చెప్పగా చాలామంది విన్నారు. ఒక దినము దీపావళి పండుగ రాగా తన చావిటిలో దీపము పెట్టుటకు సాయిబాబాగారు చాలా ఇండ్ల వద్దకు పోయి కొంచెము నూనెను అడిగాడు. అయినా ఎవ్వరూ నూనె ఇవ్వలేదు. నూనె లేనందున సాయిబాబాగారు నీళ్ళను ప్రమిదలలో పోసి దీపములను వెలిగించాడు. ఆ వింత దృశ్యమును చాలామంది చూచి ఆయనలో ఏదో గొప్పతనమున్నదని అనుకొన్నారు. ఈ విధముగా కాలము గడచుకొలది సాయిబాబాగారు శిరిడిలో గొప్పవ్యక్తిగా ప్రచారమయ్యారు. అప్పటికాలములో ఆ ఊరిలో ఒక గ్రామదేవత ఉండెడిది. ఆ దేవత ప్రతి మంగళవారము వేరే మనిషిలోనికి పూనకము వచ్చి అక్కడకు వచ్చిన మనుషులతో మాట్లాడేది. అక్కడ వచ్చిన మనుషులు అనేక రకముల సమస్యలను అడిగెడివారు. వారి సమస్యలన్నిటికీ ఆ దేవత పరిష్కార మార్గము చెప్పేది. చాలామంది మనుషులు ప్రతి మంగళవారము అక్కడికి వచ్చి వారి కష్టములకు పరిష్కారమడిగెడివారు. ఆ దేవత మీద అందరికి పూర్తి నమ్మకము ఉండేది. ప్రతి మంగళవారము సాయంకాలము ఆరు గంటలనుండి ఏడు గంటల వరకు ప్రజలతో మాట్లాడేది. అట్లు దాదాపు ఐదు సంవత్సరములనుండి జరిగేది. అప్పటికి సాయిబాబాగారు శిరిడి

గ్రామములో ప్రవేశించి దాదాపు ఆరు నెలలు గడచిపోయినది. ఆరు నెలల కాలములో సాయిబాబా ఆ గ్రామములో ఎన్నో మహత్యములను చూపుట చేత ఆయన గ్రామ ప్రజలందరిలో గుర్తింపు పొందియున్నాడు. సాయిబాబాను గురించి ఆ గ్రామస్థులందరికీ తెలుసుకోవాలని యుండుట వలన, ఒక దినము అందరు కలిసి సాయిబాబా విషయము గురించి పూనకము వచ్చు గ్రామదేవతను అడిగి తెలుసుకోవాలనుకొన్నారు.

మంగళవారము రానేవచ్చింది. దేవత పూనకము వచ్చిన వెంటనే అక్కడి ప్రజలు సాయిబాబాను గురించి ఆయన ఎక్కడినుండి వచ్చాడు? ఆయన ఎవరు? అని ప్రశ్నించి అడిగారు. ఐదు సంవత్సరములనుండి పూనకము వచ్చి దాదాపు గంటసేపు మాట్లాడు దేవత సాయిబాబాను గురించి అడిగిన వెంటనే పూనకమునుండి తేలిపోవడము జరిగినది. అడిగిన వెంటనే దేవత ఒక్క నిమిషము కూడా ఉండకుండా పోవడము అందరికీ ఆశ్చర్యమయినది. తర్వాత వారము గడచిపోయి మంగళవారము వచ్చినది. ఆ సాయంకాలము దేవత కూడా పూనకము వచ్చినది. ఆ దేవత తన భక్తురాలుగా యుండిన ఆమె శరీరము మీదికి పూనకము వచ్చేది. దేవత వచ్చిన వెంటనే అక్కడున్న వారందరూ సాయిబాబా విషయమును తిరిగి అడిగారు. అప్పుడు ఆ దేవత అక్కడున్న ప్రజలను తన వెంట పిలుచుకొని శిరిడి గ్రామ శివారు ప్రాంతములోనికి వచ్చినది. అక్కడ బయలు ప్రాంతము గడ్డిమైదానముగా ఉండేది. ఆ మైదానములో దేవత ఒకచోట ఆగి చూపుడు వ్రేలితో భూమివైపు చూపి వెంటనే పూనకము నుండి తేలిపోవడము జరిగినది. భూమివైపు వ్రేలును చూపిన దేవత రెండవమాట ఏమి మాట్లాడకుండా తేలిపోవడము జరిగినది. రెండుమార్లు ఆ దేవత అలా చేయడము అందరికీ ఆశ్చర్యమయినది.

దేవత వ్రేలుతో చూపిన భూమిని త్రవ్వి చూడాలనుకొన్నారు. మరుసటి దినము గ్రామ ప్రజలందరూ కలిసి ఆ జాగాను త్రవ్వడము జరిగినది. భూమిని రెండు అడుగుల లోతు త్రవ్వగానే పేర్చి పెట్టిన ఇటుకలు కనిపించాయి. కనిపించిన ఇటుకలను ప్రక్కకు తీసి చూడగా భూమిలోనికి ఒక సొరంగ మార్గము కనిపించినది. క్రిందికి ఇటుకలతో పేర్చబడిన మెటికలు కలినిపించాయి. ఆ మెటికల గుండా లోపలికి దిగి చూడగా, భూగర్భములో ఎనిమిది అడుగుల లోతులో ఒక పెద్ద రూములాగ బయలు కనిపించినది. పదిహేను అడుగుల పొడవు, పదిహేను అడుగుల వెడల్పు గల గదిలాగ ఉండడము, ఆ గది దాదాపు పది అడుగుల ఎత్తు కలిగి యున్నదిగా కనిపించినది. ఆ గది మధ్యలో మూడు అడుగుల ఎత్తు, మూడు అడుగుల పొడవు, వెడల్పుగల ఒక అరుగు కనిపించినది. ఆ అరుగు మీద ఆవు తల ఆకృతి గల బొమ్మ ఒకటియుండగా, దానిముందర ఐదు దీపములున్నట్లు కనిపించినది. ఆ దీపములు ఎప్పుడు ముట్టించినవో ఎవరికీ అర్థము కాలేదు. దానినంతటినీ ఆశ్చర్యముగా చూచిన జనులు అక్కడి నుండి వచ్చారు. సాయిబాబాను గురించి దేవత ఏమి మాట్లాడకుండా ఆ జాగాను చూపడము వలన, ఆ జాగా విషయము సాయిబాబానే అడిగి తెలుసుకోవాలనుకొన్నారు.

ఆ ఊరి పెద్ద మనుషులందరూ కలిసి సాయిబాబా వద్దకు పోయి, ఊరి బయట బయలు ప్రాంతములో దేవత చూపించిన జాగాను త్రవ్వగా, సొరంగము భూగర్భములోని గది కనిపించినదని చెప్పారు. అందులో గోముఖ ఆకృతి మరియు దీపములున్నట్లు సాయిబాబాకు తెలిపి దానిని గురించి అడిగారు. అప్పుడు గ్రామపెద్దల మాటలను వినిన సాయిబాబా గారు లేచి హుటాహుటిన ఊరి బయటగల భూగర్భములోని గదివద్దకు చేరుకుని, అక్కడ సొరంగమును చూచి ముందు ఆ రంధ్రమును

మూసివేయమని చెప్పాడు. అక్కడ త్రవ్వియున్న సొరంగ మార్గమును చూచిన సాయిబాబాగారి ముఖములో కొంత కోపము కూడా కనిపించినదట. దానిని వెంటనే మూసివేయమని గద్దించి చెప్పగా, అక్కడ చేరిన వారందరూ శ్రమపడి ఆ రంధ్రమును మూసివేశారు. అప్పుడు సాయిబాబాగారు ఆ ఊరి ప్రజలతో ఎప్పటికీ ఈ రంధ్రమును తీయవద్దని చెప్పాడట. అయితే ఆ గుహను గురించి ఇటు దేవతగానీ, అటు సాయిబాబా గానీ ఏమి చెప్పలేదు. అప్పటినుండి ఆ సొరంగమును ఎవ్వరూ త్రవ్వ దలచుకోలేదు. సొరంగమార్గము భూమిలో ఉన్నట్లు వ్రేలు చూపిన దేవత తిరిగి ఎప్పుడూ పూనకము రాలేదట. సాయిబాబాగారు వద్దని చెప్పిన పనిని ఎవరూ చేయలేదు. దేవత తర్వాత పూనకము రాకపోవడము వలన సొరంగము యొక్క రహస్యము ఎవరికీ తెలియకుండా పోయినది.

నేను ఇంతవరకు శిరిడికి పోయి ఏదీ చూడలేదు. అయితే ఈ విషయములన్నియు సాయిబాబాగారు బ్రతికియున్నప్పుడు వారితోపాటు శిరిడిలో నివసించిన వ్యక్తి 'శిరిడిలో తన అనుభవము' అను ఒక చిన్న గ్రంథమును వ్రాసియుండుట వలన ఈ విషయములు నాకు తెలిసినవి. ఒకప్పుడు అనంతపురము జిల్లా పామిడి నివాసి అయిన ఒక వ్యక్తి ఆయన పేరు సరిగా జ్ఞాపకము లేదు. బహుశా వెంకటస్వామి అని అనుకుంటాను. పామిడి ఏరులో మధ్య భాగమున చిన్న గుడులు గలవు. ఆ గుడులను నిర్మించినట్లు ఆ గ్రంథములో వ్రాశారు. గుడులను నిర్మించాడు అంటే బాగా స్థోమతయున్న మనిషే అని అర్థమవ్వగలదు. ఆ వ్యక్తి సాయిబాబాగారు శిరిడీకి వచ్చినప్పుడు అక్కడే అనగా శిరిడిలోనే నివసించేవాడట. అప్పటికే ఆయన పామిడి గ్రామమును వదలి శిరిడి చేరినట్లు వ్రాశారు. సాయిబాబా గారు శిరిడిలో ఉన్నప్పుడు ఆయనతోపాటు శిరిడిలోయున్న వెంకటస్వామి

అను వ్యక్తి వ్రాసిన తన అనుభవములను చూచిన (చదివిన) తర్వాత సాయి బాబాగారి విషయము, భూమిలోయున్న గుహ విషయము, గ్రామదేవత విషయము తెలిసింది. ఈ విషయములు ఇతరులకు తెలుసునో, తెలియదో నాకు మాత్రము తెలియదు. వెంకటస్వామిగారు కూడా ఆ దినములలో సాయికి అత్యంత సమీప భక్తునిగా ఉండెనని వ్రాశాడు.

సాయిబాబాగారు శిరిడికి పోకముందు పెనుకొండలో నివసించాడని బాబా పకురుద్దీన్ చెల్లెలు అంబోజమ్మ ద్వారా తెలియగా, సాయిబాబాగారు శిరిడిలో కనిపించకముందు పెనుకొండ సమీపములోని గుహలో తపస్సు చేసినట్లు, ఆయన శిరిడిలో కనిపించకముందు పెనుకొండ నుండి పోయిన తర్వాత శిరిడి గ్రామ బయట భూమిలో గల గుహయందు చాలా సంవత్సరములు తపస్సు చేసినట్లు తెలియుచున్నది. ఎంతోకాలము తపస్సు చేసిన ఆయన తన తపస్సును ఆపి ఊరి బయటనుండే పెళ్ళి బృందములో కలిసి వచ్చాడు. అంతేతప్ప అతను వేరే ఊరినుండి శిరిడిలోనికి రాలేదు. ఇక్కడ ముఖ్యముగా తెలియవలసిన విషయము ఒకటి గలదు. అదేమనగా! పెనుకొండలో తపస్సు చేసినప్పుడు వయస్సు దాదాపు అరవై సంవత్సరముల పైగానే ఉండేవి. శిరిడిపోయిన తర్వాత భూగర్భ గుహలో అదే శరీరముతో తపస్సుచేసి పూర్తి వృద్ధాప్యములో బయటికి వచ్చాడు. బయటికి వచ్చిన తర్వాత పాత శరీరమును వదలి సూక్ష్మశరీరముతో కొన్ని రోజులుండి ఒక దినము శిరిడికి అడుక్కునే దానికి వస్తున్న పకీర్ లోపలికి సాయిబాబా సూక్ష్మశరీరము చేరిపోయినది. అడుక్కొను పకీర్ వయస్సు అప్పటికి దాదాపు ముప్ఫై సంవత్సరములుండవచ్చును.

30 సంవత్సరములుగానీ లేక 25 సంవత్సరములుగానీ వయస్సున్న పకీర్ శరీరములో చేరిన సాయిబాబా పకీరుగానే శిరిడిలో ఉండెడివాడు.

ఆయన శరీరమును మార్చుకొన్నది ఎవరికీ తెలియదు. సాయిబాబాకు పెనుకొండలోయున్న శరీరము శిరిడిలో లేదు. అట్లే శిరిడిలో ఉన్న శరీరము పుట్టపర్తిలో లేదు. శిరిడిని వదలివచ్చిన తర్వాత సత్యనారాయణ రాజు శరీరములో చేరి జీవనమును సాగించాడు. ఇప్పుడు కూడా ఆయన మరణమును పొందక సూక్ష్మశరీరముతో బయటికి వచ్చి ఏదో ఒక శరీరమును ధరించి జీవనమును సాగించును అని అనుకొంటున్నాను. మనకు తెలిసి పెనుకొండలో ఒక శరీరము, శిరిడిలో మరొక శరీరములో యున్న సాయిబాబా పుట్టపర్తిలో వేరొక శరీరమును వాడుకొన్నాడు. ఈ విధముగా పెనుకొండ, శిరిడి, పుట్టపర్తి అను మూడు ఊర్లలో మూడు శరీరములను మార్చి నివసించినట్లు అర్థమగుచున్నది. ఈ విధముగా ఆయన ఎంతో తపస్సు చేసి సంపాదించుకొన్న శక్తిని మహత్యములకు వినియోగించుకొన్నాడని అర్థమగుచున్నది. ఆయన బ్రతుకు ఆయన బ్రతుకగా ఆయను గురించి ఏమాత్రము తెలియక, ఆయన దేవుడని కొందరు, దేవుడు కాదని కొందరు వాదించుచున్నారు. సాయిబాబా నిజ జీవితము మూడు తరములనుండి తెలిసిన మేము సాయిబాబా ఒక మహాత్ముడు గానీ దేవుడు మాత్రము కాదని చెప్పుచున్నాము.

ఇట్లు

**ప్రబోధానంద యోగీశ్వర్**

**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే**
**ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**

---

**అసత్యమును వేయిమంది చెప్పినా, అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా, అది అసత్యము కాదు.**

# సాయిబాబా దేవుడా! కాదా?




*Author :*

***The Only GURU of Three Religions***

***The Spiritual Emperor, Thraitha Theorem Originator***

***Sri Acharya Prabodhananda Yogeeshwarulu***



**www.thraithashakam.org**